# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్




నవంబరు 1958

సంపుటము 35 : : సంచిక 11

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## నవంబరు 1958



# 1893 నుంచి జలుబులకు

# అమృతాంజనము

ఇప్పటికి మూడు తరాలనుండి అమృతాంజనం జలుబులనుండి శీఘ్రమైన విముక్తికోసం వాడబడుతున్నదని అందరికీ తెలిసిన విషయమే.






అమృతాంజన్ లి., మద్రాసు 4. మరియు బొంబాయి 1, కలకత్తా 7.

AL.37.2 TEL.

ప్రతి ఆదివారం రాత్రి 6-30 గం॥ లకు 41 మీటర్ల మీద రేడియో సిలోన్‌లో దక్షిణ భారతభాష లన్నింటిలో వెలువడే ప్రోత్సాహిక కళాకారుల ప్రోగ్రామ్, అమృతాంజలి వినండి.

# మహాత్మ స్మృతి

శ్రీ కందుకూరి రామభద్రరావు

ఓయి మహాత్మ! నీవొక మహోన్నత పర్వతరాజ మట్లు, భ
ద్రాయితమూర్తివై భరతధాత్రిని నిల్వగ, సర్వమానవుల్
పోయిన సత్తువల్ తిరిగి పొంగులువెట్ట, భవత్ప్రబోధనం
ధాయిత చిత్తవృత్తుల విదల్చిరిగా పరదాస్యశృంఖలన్.

బోసినో రొక నవ్వుపొల్పు వెలార్చినా
పండువెన్నెల మొదల్ నిండిపోయె
పల్కులు జడిగట్టి పైకి వర్షించెనా
అమృత ప్రవాహంబు లంత బారె
కరుణాకటాక్ష వీక్షణములు పరగినా
సంతప్తహృదయవసంత మెనఁగె
ధైర్యహేమాచల దర్శనంబబ్బినా
మంటి ముద్దల వీరమణులు పుట్టె

అవని పులకింప నీవొక్క యడుగుపెట్ట
మానవాంభోధి జయఘోష మార్మ్రోగ
ధర్మ సంస్థాపనార్థ పథంబువట్టి
పుడమిమెట్టిన యవతారమూర్తి వీవు.

ప్రేమకు వచ్చె నీయెడద పెంపునఁ గోమల నవ్యకాంతి, నీ
నేమపు బాటలో నలిగి నిష్ఠయె నూతన పుష్టిగాంచె, గా
రాముని నీవు కేలొసఁగ రాచరికంబు వహించె శీల, మే
మేమొ వెలుంగు గుంపులకు నేలిక లయ్యె భవత్కటాక్షముల్

శిథిలపర్ణకుటీర చిరనిరంతరదుఃఖ
ఖిన్నుల కన్నీరు కేలఁదుడిచి
పరదాస్యశృంఖలాబద్ధ నిస్పృహులకు
హృదయగహ్వర తేజ మెనగఁద్రోచి

అజ్ఞాన తిమిరసీమాంతరాంతరముల
మినుకు దివ్వెలు నిల్పి మేలు కనిపి
రక్తసంసిక్త సామ్రాజ్యరాక్షీకరాం
భోజముల్ ప్రేముడులోవ్వసి కడిగి

నవ్యనాగరక ప్రసన్నతలనదుమ
తొలగు జీవితమూల్యంబు నిలువబెట్టి
చన్న నీ స్థితప్రజ్ఞకు స్తవనమేడ
నరుల గుండెలలో కృతజ్ఞతలు దక్క

కానియు లేదు నీకయినఁగాంచన వర్షము నీయధీన, మె
ద్దానికి లేదు నీవిభుత, కాల్పె ప్రభుత్వమె నీదు నాజ్ఞ, లీ
మానవకోటికిఁ శిరసు మండన మయ్యె భవచ్చరిత్ర, వ్యా
ఖ్యానము గీతకున్ బ్రదుకు; కారణజన్ముడవయ్య ధాత్రిపై

తూరుపుద్వారమందుఁ బరితోషణ తోరణకాంతిపుంజముల్
దీరిచి, మంగళధ్వనులు దిక్కుల బర్వ స్వరాజ్య లక్ష్మికిన్
భారతనారులు న్నరులు పట్టముగట్టిరి పండువృద్ధవై
వారలనమ్రశీర్షములపై వెదజల్లితి మందహాసముల్

పిచ్చికిగూడఁ గొంతగ వివేకము కన్పడు; బుద్ధి యెంతక
మ్మెచ్చిన లాగినన్ విడదు మీమహిమె 'జ్జ్వలమూర్తి లోపలన్
చిచ్చులరవ్వలన్ బఱప చేయెటులాడెనో! గుండెనిల్పెనో!
చొచ్చె తమస్సు నీ వరుగ; శోకము నిండె సమస్త లోకమున్.

మానవమనోంబరంబున మార్గదర్శ
కంబుగ వెలుంగు ధ్రువతారగా మహాత్మ!
పలు శతాబ్దులు నిల్పెదు; పాణిపద్మ
ములు మొగిడ్చి నమశ్శతమునుఘటింతు.

"మరేం భయం లేదులే మీ అమ్మకు. కొంచెన్నం వండి పడేసి వేగంగా రా మాయింటికి. యీరమ్మ, రాములు, లచ్చిమి, అప్పాయమ్మ యీ గుంటలంతా వత్తారు కోలాటాకే" అంటూ వెనుదిరిగి చూడకుండా వెంకమ్మ వెళ్ళిపోయింది.

నిజానికి నాగులుకి యేం చెయ్యడానికి తోచడం లేదు. ఏదోవిధంగా కష్టపడకపోతే, రోజు గడవడం యెంతకష్టమో నాగులుకి బాగా తెలుసు. ఆమెకు జ్ఞానం రాకపూర్వమే, ఆమె తండ్రి యీ ప్రపంచం వదలిపెట్టాడట. అప్పటినించీ యీతల్లే తన్నింత చేసింది. ఈ విషయం తనకు తెలిసినప్పటినుండి ఆమెకు తనతల్లి అంటే యేదో అర్థంతెలీని అభిమానం ప్రేమ. ప్రస్తుతపరిస్థితుల్లో తనూ, తల్లీకూడా కష్టపడినా రోజు గడవడం దుర్లభంగా ఉంది.

పని చేయించుకునేవాడల్లా ఎక్కువ ప్రతిఫలం యిస్తున్నానని గోలేగాని ఇచ్చేదాంతో బజారులో యేం వస్తోందో ఎవడికీ అక్కర్లేదు.

ఏది యేమైనా నాగులు యింట్లో పనిచేయని రోజసలే. తల్లి శరీరావస్థతో నాగులుతలబరువెక్కింది. వెంకమ్మ వాళ్ళతో వెళ్ళడమా లేదా? అన్న ప్రశ్న ఆమె కింకా తలబరువెక్కించింది. ఏమయినా ఆమె తల్లి చెప్పినట్లు "పేదవాడికి పాట్లుండు". వెళ్ళక తప్పదు.

ఈమధ్య కూలికెళ్లడం అంటే కష్టమనిపిస్తోంది నాగులికి. శరీరం వంచి కష్టపడి పనిచేయడానికి భయపడి కాదు. తోటి కూలీల ప్రవర్తన చూసి. పనిచేస్తూంటే అస్తమానం తనప్రక్కనే నిలబడుతూ, కళ్ళతో తన శరీరాన్నంతా తడిమి చూసే ముసలి మేస్త్రీని చూస్తే కంఠం కోసుకుందామా అనిపించేదామెకు. పెళ్లాం ఎదురుగానే తన్ని మాటలతో బాధించి ఆనందించేవాడు మరో కూలివాడు; గంప తలకెత్తిస్తూ పొరపాటున తాకినట్టు మోచేతిలో తనరొమ్ము తాకేవాడు, దున్నపోతులాంటి మరో కుర్రవెధవ. వీళ్ళందరినీ యేం చెయ్యాలో తెలీక కూలిపోయేది. పని చేయకపోతే నిలువునా మాడి చచ్చిపోవలసి వస్తుంది.

తల్లికి చెపితే "అవన్నీ బీదవాళ్ళు తప్పించుకో లేని సాంఘిక దౌర్జన్యాలు, కత్తివాయిమీద నడిచినట్లు, యీ జీవితం గడపాలి. ఈ యీతిబాధలన్నీ, అతి నేర్పుతోను ఓర్పుతోను ఎదుర్కోవాలి. పరిస్థితుల్ని మనోదార్ఢ్యాన్ని బట్టి నడుచుకోవాలి. అంతేగానీ, ప్రస్తుత సామాజిక వాతావరణంలో యీ అవినీతి నడవడికను, అసహ్యప్రవర్తనలను ముక్కుకు సూటిగా ఎదుర్కోడం కష్టం మాటకేమి గాని అసంభవం" అన్న ధోరణిలో ఎంతో చక్కగా చెప్పిందామెకు. ఆమె చెప్పిన విషయాలు చాలా లోతయినవి. జీవితం స్వయంగా చిలికి చేకూర్చుకున్నవి.

నాగులు మనస్సులో తల్లి బోధనలు స్థిరస్థావరా లేర్పరచుకున్నాయి. బీదతనం గూర్చి, ప్రపంచంలో నిరాఘాటంగా కొనసాగే చట్టబద్ధమయిన అవినీతుల గూర్చి తన తల్లికి తెలిసినంత యితరుల కెవ్వరికీ తెలీదన్న గాఢ విశ్వాసం ఆమె మనస్సులో పాతుకు పోయింది. తల్లి చెప్పిన మాటలు అమాయకంగా విశ్వ సిస్తుంది. అదో అలవాటయింది కూడా.

వెంకమ్మ వెళ్ళాక లోనికిపోయి ఈ విషయం అంతా తల్లితో చెప్పింది. నిజానికి తనకు, ఆమె నాస్థితిలో విడచి వెళ్ళాలని లేదంది. కాని అపాటి దానికే నాగులు తల్లి ఒప్పుకుంటుందా? ఆరోజు కూలికి పోకపోతే మరునాడు పస్తు తప్పదని తెలీక పోడం లేనేలేదు. అనేకవిధాల చెప్పి కూలికి వెళ్ళమని ఒప్పించింది నాగులును.

రోజులుచూస్తే కడు వికృతంగా ఉన్నాయి. డబ్బున్నా తిండిబియ్యం దొరకడం చాలా దుర్లభంగా ఉంది. ఎక్కడికక్కడే బియ్యంకొరత విన వస్తూంది. దినదినం ప్రజలలో బియ్యాన్నిగూర్చి ఆందోళన ప్రబలుతూంది. ఇదే అదనని అనేకులు అనేకవిధాలుగా బ్రతుకుతున్నారు. డబ్బున్నవాళ్ళు మరీ ధనవంతులవుతున్నారు. ఈ పరిస్థితి అనేకుల అమాయకుల ప్రాణాలు బలిపుచ్చుకుంది.

ఊళ్ళో కూలి లేకపోవడంవల్ల నాగులు, వెంకమ్మ మొదలుగాగల వాళ్ళు ఈ పరిస్థితి ఊతగా తీసుకుని బ్రతుకుతున్నారు. ప్రక్కబస్తీలో దొరుకు తున్న బియ్యం కొని యింకోవూరికి పోలీసుల కంట బడకుండా పట్టుకుపోయి అమ్ముకుంటున్నారు.

అనుకున్న ప్రకారం నాగులు వెంకమ్మ యింటి వద్ద, అందరినీ కలుసుకుంది. ప్రక్క బస్తీకి నడదామను కుంటే నడదామనుకున్నారు. ఏవో ఏవో మాటలు చెప్పుకుంటూ, కిలకిల నవ్వుకుంటూ, దారంట మరేం

జరుగుతోందో తమకేమీ తెలియనట్లు కేరింతాలు కొడుతూ పోతున్నారు. దార్లో నడూస్తున్న బాటసారులు తమనే హేళనచేసినట్లు మనస్సు చివుక్కుమంటూంటే తీక్షణంగా, కోపంగా వీళ్ళవైపు చూడుకుంటూ పోతున్నారు. మధ్యవయస్క కాస్త వరాల విప్రాగి ఉన్న పెద్దమనుషులు బాహాటంగానే నోరు విడిచి "పోకిరీ వెధవలు! బుద్ధిలేని నాటకపు పీనుగులు!" అని తిట్టుకుంటూ వెళ్ళారు.

ఎవ్వరేమన్నా అనుకున్నా, విలపించుకోకుండా, లెక్కలేకుండా, నిర్వికారంగా, వాళ్ళు తమ పూర్వానుభూతులు చెప్పుకుంటూ, ఆనంద ఘట్టాలు వినవచ్చినప్పుడు సంతోషిస్తూ, కాస్త నవ్వు పుట్టించే విషయాలు వినవచ్చినప్పుడు కొంచెం గట్టిగా నవ్వుకుంటూ, విషాదపూరితాలు రూపించినప్పుడు, విచారంతో మౌనంగా పోతూఉన్నారు.

అలా రైలువచ్చే వేళకు సరిగా రైల్వేస్టేషను చేరుకున్నారు. వెంకమ్మ టిక్కట్లుకొనే కిటికీదగ్గరకు వెళ్ళగానే టిక్కట్లిచ్చేగుమాస్తా కనుబొమ లెగరేస్తూ "ఏంముసలమ్మా, యేమిటి సంగతి" అన్నాడు మందహాసపూర్వకమయిన ముఖం పెట్టి. వెంకమ్మ ముసలిది మాత్రం కాదు. కాని యౌవనంపొంగే ఆ యువతుల మధ్యఉంటే వెంకమ్మ పండుముసలని ఎవరంటారు.

అయినా వయసులోఉన్న అందరాన్ని చూసేసరికి, మూగవాడికికూడా మాటలు పుట్టుకొస్తాయి. అసె వాళ్ళ విలువ ఉపయోగం అంతమాత్రమే నేమో!

వెంకమ్మను ఎవరికీలా జనాభిమాన్యంలో బాగా తెలుసును. "నీకు తెలియని దేముందినాయనా!" అంది పాలిపోయిన పెదవులనుండి పేలవమయిననవ్వు జారవిడుస్తూ. ఇతరమయిన ప్రశ్నలేమీ వేయకుండా, ఆ గుమాస్తా వెంకమ్మకు కావలసినటిక్కట్లు ఇచ్చేశాడు. వెంకమ్మ అతని బాగోగులు ప్రశ్నించి, వెళ్ళవస్తానంటూచెప్పి చల్లగా వచ్చేసింది. వాడుకూడా అదే యేదో గొప్ప ఆనందదాయకమయినట్లు ఆనందించేసి, ఆమె వెళ్ళాక తన చిరునవ్వు నెమరు వేసుకుంటూ కూర్చున్నాడు.

ఇలాంటి లౌకిక ప్రవర్తనవల్ల వెంకమ్మ చాలా మంది పరాక్రమ జీవులకు ముట్టజెప్పవలసిన వాలుకు పైసాలు మిగిలించుకునేది. ఎవరివద్ద ఏవిధంగా మాట్లాడాలో ఆమెకు మంచినేర్పు ప్రాయం. అప్రయత్నంగా ఏడవడం, అప్పటికప్పుడే నవ్వడం, పదిరోజులనుండి తిండిలేనట్లు ముఖం పెట్టడం, మృదువుగా నవ్వుతున్నట్టే ట్టు, దీనంగా సానుభూతికలిగేట్లు మాట్లాడ్డం ఆమెకు కరతలామలకం. ఈలాంటి జీవితంతోనే ఆమె చాలా భాగం జీవితాన్ని గడిపింది. తనతో వచ్చిన జట్టులో ఎవళ్ళకు యే చిక్కు వచ్చినా తన శక్తియుక్తులచేత ఎలాగోఒకలాగ తప్పిస్తూ, దినదిన గండం నెయ్యేళ్ళ యుష్షులాగ జరిగిస్తోంది వ్యాపారం. ఆమె జట్టులో ఆమెమాటకెవరూ కాదనరు. ఒకవేళ వాళ్ళకు రావలసినడబ్బంతా, నిజంగా వెంకమ్మ ఎగేసినా ఆ బ్రహ్మ దిగివచ్చి నచ్చచెప్పినా, వారు వెంకమ్మకెదురుతిరగరు. ఎందుచేతనంటే, వెంకమ్మ తమకెన్నడు ద్రోహం చేయదనీ, చెయ్యలేదనీ, వాళ్ళహృదయాంతరాళాల్లో జీర్ణించిపోయింది. ఆ నమ్మకాన్ని స్థానాన్ని సంపాదించింది వెంకమ్మ వాళ్ళమధ్య.

రైల్వే స్టేషనుమాస్టరు ఏభయ్యోపడిలో పడ్డాడు. నిర్మలత్వాన్ని, నిశ్చలతను సూచించే గంభీరమయిన ఆ కళ్ళు, ముడతలుపడి మాటాడితే ఊగిసలాడే అతని ముఖము, అసలు కలతచెందని మనస్తత్వము. ఆ తెల్లటి యూనిఫారము పరిశీలిస్తే మామూలు వాళ్ళకు ఆదో రకమైన భయంతో కూడిన గౌరవం కలుగుతుంది.

వెంకమ్మ స్టేషనుమాస్టరును బాగా ఎరుగును. స్టేషనుమాస్టరుబాబుకి వెంకమ్మ తన శక్త్యనుసారం చిన్న చిన్న లాభసాటి పనులు చేస్తూంటుంది. ఆమె మాటల మంచితనంవల్ల నయితేనేమి, ఆమెవల్ల తనకు జరిగే క్షుద్రలాభాలవల్ల నయితేనేమి రెండు మూడు సార్లు ముసలిమాష్టరు వెంకమ్మను నిజమయిన అపాయాలనుంచి రక్షించాడు. వెంకమ్మ అతణ్ణి దేవుడంటుంది.

ఆరోజు మాష్టరుబాబు వెంకమ్మను వీక్షించి దరహాసవదనంతో "ఏం? వెంకమ్మా యేమన్నా ఉందేమిటి?" అన్నాడు.

"యేటిబాబూ, తెలిసున్నోరు మీరుకూడానా చెప్పండి. మీరేదో పెద్ద దొంగ సావుకార్లని పట్టాలి కాని" అంది నవ్వుతూనే.

"బాగా చెప్పావులే."

"అది కాదు బాబూ. మేవిప్పుడు ఈ యాపారం సేత్తున్నామంటే యేంనాభాలు దొరికేతున్నాయి. యిక్క

వచ్చా వ్యాపారంచేయటానికి లేదండి. మనుష్యులందర్నీ దొంగల్లా చూస్తారు. ఏదో ఆ వారానికి సరిపడ దారి కితే అదే గొప్ప. తను రానని దేముందిలెండి. యెంత మంది దాబుసీత్తారో మా మీద. ఒకడా, ఇద్దరా. దారి కడాకు దీపాలే బాబు"

"ఆ దీపాలన్నిటికీ చమురు పొయ్యాలా యేం" అన్నాడు మా పరుశాబాబు నవ్వుతూ, తనుకూడా ఆ దీపాలలో ఒక దీపమన్న మాట మరచి.

"బాగా సెప్పావు బాబు. మా నాయన, సల్లగా సౌఖ్యంగ ఉండు పదికాలాలపాటు."

"వస్తా, వెంకమ్మా" అంటూ మేడరు తనగదివైపు మరలి కొంతదూరం నడిచి ఏదో జ్ఞాపకం వచ్చినట్లు వెనుదిరిగి "వెంకమ్మా" అని పిలిచాడు. వెంకమ్మ ఆయన దగ్గరకు పరుగు పరుగున వచ్చింది.

"చూడు! ఇంట్లో కూరగాయలు లేక మా చెడ్డ బాధ పడుతున్నాం ఎలాగయినా" అంటూ మాట తుంచి డబ్బులు తీస్తున్నట్లు జేబులో చేతులుంచి కస్సు మిటకరిస్తున్నాడు.

వెంకమ్మ కూడా అతని తాపత్రయం అంతా గమనించనట్లు నటిస్తూ—"ఈపాటి భాగ్యానికి డబ్బులివ్వాలా బాబూ. నే తిరిగొచ్చేటప్పుడు తీసుకొని వస్తా" అని చెప్పింది.

"మంచిది అంటూ ముసలాయన తన గదిలోకి వెళ్ళాడు.

అప్పటికప్పుడే రైలుబండి యింటికున్యంలోకి వచ్చేసింది. స్టేషనులో గణగణ గంటకొట్టారు, ప్రయాణీకులను తమతమ సామానులు సర్దుకుని రైలు ఎక్కడానికి సిద్ధంగా ఉండమని హెచ్చరించేటట్లు. పెట్లల్లో జనం కిటకిటలాడుతున్నారు. ప్రయాణీకులు ఒక నొమిష్త్రంలో మునిగిపోయినట్లు గుమికూడారు ఆ పెట్టెలవద్ద. వెంకమ్మ ఆమెజట్టు తమ ప్రాణాలు అరచేతులో ఉంచుకుని రొక్కగలిగారు ఆ పెట్టెలోకి.

ఆ రెండు నిముషాల్లోను ఆ ప్లాటుఫారంమీద ఎంత దారుణమయిన అరాచకం రేగిందో ఆ రైలు పోగానే అది అంత నిర్మానుష్యం అయింది.

రైలు కదిలేవరకు రైలుపెట్టెలో మనుషులు ఉడికి పోయారు ఎండవేడికి గాలిలేక. రైలునడకవేగంవల్ల గాలి బాగాసోకుతోంది. లోపలమున్నవాళ్ల శరీరాలు చల్లబడ్డాయి. నిలుచున్నవాళ్ళు కూర్చున్నవాళ్ళమీద కారాలు మిరియాలు నూరుతున్నారు. వెంకమ్మకు ఆమె జట్టుకు యిది మామూలు ప్రయాణం అవడంవల్ల యీ తిరుపులాటలనుండి తప్పుకుని ఓ మూల నేలమీద చతికిల పడ్డారు. లోకాభిరామాయణం విప్పారు. కూర్చున్న వాళ్ళు మనకేం అన్నట్లుగా ఒళ్ళెరుగక కూర్చునే జాగాల్లో కాళ్లుచాచుకుని కూర్చున్నారు.

ప్రౌఢాంగన ఒకరు వేరుశెనగకాయలమ్ముకు పొయ్యేదానికి రైలుపెట్టెలో ప్రత్యేకస్థలం ఏర్పాటు చేయలేదనే ధైర్యంతో కాబోలు వేరుశెనగకాయల బుట్టతో ఆ పెట్టె నింపుతోంది. ఆమె ప్రక్కగా కూర్చున్న నాటుఅసామీ ఒక పొడుగాటిచుట్ట వెలిగించి ఆటంబాంబుపొగమబ్బులు వదులుతున్నాడు. ఇవంతా చూస్తూ సహించి ఊరుకున్నారు ప్రయాణీకులు.

చంటిపిల్లనెత్తుకున్న ఓ కోమటితల్లి కూర్చున్న వాళ్ళందరినీ ఆశతో కలయజూస్తోంది. నుంచో లేక పోతోంది. ఆమెవైపు కన్నువాల్చకుండా చూస్తున్న వెంకమ్మ ఆమెను కూర్చోమంది తను లేచి. ఆమె యిటూ అటూ చూసి, తన నీరసానికి, నిస్సహాయతకు మనస్సులో నే తిట్టుకుంటూ అయిష్టంగా చాగిల బడిందా నేలమీద.

ఇవంతా నాకెందుకులే అన్నట్లు రైలుబండి అమితవేగంతో కదిలిపోతూంది పొగ వెళ్ళగక్కుతూ.

ఆమె ఒడిలో పిల్లాడు దారుణంగా యేడ్వడం మొదలెట్టాడు. ఆమె ఎంత ఓరడించినా ఓరకోవడం లేదు. ఊరుకో బెట్టినకొద్దీ వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు.

"అమ్మాయీ! యీపాటి తెలీలేదా! కడ్డాడు చెమటు కక్కుతూంటేను. ఉక్కపోసి యేడుస్తున్నాడు యిలాయియ్యి" అని వెంకమ్మ ఆ పిల్లాడిని తీసుకుని పైకెత్తి అక్కడున్న వాళ్ని ఒతగించి కిటికీదగ్గర నిలబెట్టింది. పిల్లాడు రోదన మానివేసినోటితో నవ్వుతూ చేతులు కాళ్ళూ ఊపుతూ నాట్యం చేస్తున్నాడు. అంతయేడుపు మాయమయింది ఆర్పిన ఎలక్ట్రిక్ బల్బులో కాంతిలాగ. రైలుబండి మళ్లీ ఆగింది. వెంకమ్మ పిల్లవాడిని తల్లికిచ్చింది.

తమతమ సంచీలు మూటలూ తీసుకుని వెంకమ్మ, ఆమెజట్టు దిగిపోయారు గుడ్లతిప్పి కన్నులొట్టపోయిం

దనుకుంటూ. స్టేషన్లోని వాళ్ళు తన్ను పలకరించుతూంటే యెవరికి తగినసమాధానం వారికిస్తూ, ఆపిల్లల గుంపును వెంటబెట్టుకుని వెంకమ్మ బజారుకి చల్లగా జారుకుంది.

దారంట నడుస్తున్నారంతా త్వరిత గమనంలో తలలువంచుకుని. మొట్టమొదట యింటినుండి బయలుదేరినప్పుడున్న చలాకీ కబుర్లు నవ్వులూ పూర్తిగా విస్మరించారు కాని, అనపికలో యింకా ఆ అహంకారము స్వతంత్రత పూర్తిగా మూర్తీభవించి ఉన్నాయి. వాళ్ళు బజారుకుపోయి కొనవలసిన బియ్యం అన్నీ కొని, పరుల కంటబడకుండా ఉండడానికని అనేక చిన్న పెద్ద మూటలుకట్టి మళ్ళీ రైల్వే స్టేషనుకు బయలుదేరారు.

వెంకమ్మ మిగతా వాళ్ళందరకు నడుచుకోవలసిన రీతి బోధిస్తూంది. ఎవరితోనూ యెవినయమయిన మాట పట్టింపు పెట్టుకోగూడదనీ, తమపని చక్కబెట్టుకునే వరకూ వినయంగాను, ప్రార్థనాపూర్వకంగాను మాట్లాడమనీ సూచించింది.

మిగతా వాళ్లు అంతా వెంకమ్మంత అనుభవశాలులు కాకపోయినా యీ విషయాల్లో కొంచెం విజ్ఞానవతులే అని చెప్పుకోవాలి. వాళ్లకి మాత్రం యీ ప్రాధేయ పడడంలోను, ప్రార్థనలలోనూ నమ్మకంలేదు. వాటివల్ల మనుషులు యెంత కుమిలిపోవాలో, నవ్వులాట పాలవాలో చాలాచాలా సార్లామె అనుభవించిన విషయం.

ఇలాంటి చట్ట వ్యతిరేక వ్యాపారాల్లో ముఖ్యంగా దీనాలాపాల ప్రభావం అతి స్వల్పం. చిల్లిగవ్వపనికూడా జరగదు. "తామీ విధంగా పొట్టపోసుకోవలెనని చూస్తే, ఓ ఉద్యోగి కాస్త మంచి మంచి దుస్తులు తొడుక్కొని దర్జాగా కాలం గడపాలని చూస్తాడు. మరో దొంగవ్యాపారి అంతస్తుపై అంతస్తు మేడలు కట్టించాలని చూస్తాడు. దీనిలో జాలీ దయా యెక్కడిది?" అనుకుంటుంది వాళ్లు.

అయినా వెంకమ్మలో ప్రత్యేకత ఉంది. ఆమె టక్కరి బొల్లి బొల్లి యేడ్పులతో చాలా గొప్పపనులు తమ కన్నుల యెదురుగానే చేయగల్గింది. అందరూ వెంకమ్మలా ఎలా చేయగలరు! అందుకే తమకు సాధ్యంగాకపోయినా ఆమె మాటలు అందరూ మౌనంగా వింటారు.

వాళ్ళు దార్లో చౌకీకి దూరంగా దూరంగా నడుస్తూ, అనుమానంతో అప్పుడప్పుడు చౌకీదారు వైపు చూస్తూ నడుస్తున్నారు. వీళ్ళు చల్లగా జారుతూంటే ఆ చౌకీదారు చేత్తో సంజ్ఞ చేశాడు. వెంకమ్మకూడా సంజ్ఞాపూర్వకంగానే సమాధానం ఇచ్చింది. వాడు మీసాలు మెలెడుతూ అటువైపు చూస్తూ నిలబడ్డాడు.

అతడి బుజంమీద బరువుగా పడిందో దెబ్బ. అతడు ఉలిక్కిపడి అటు చూచాడు. కాస్త జంకాడు.

"ఆ! యేమిటా సంజ్ఞలు! ఆ ముసలిదాన్నెరుగుదువా?"

"అబ్బే ఏం లేదండి."

"దాంతో యేదో సంజ్ఞలు నడుపుతున్నావు. మంచి నక్కల్లాంటి గుంట వెంటేసుకు తిరుగుతోంది. యేటి సంగతి."

"యేటో చిన్న చిన్న యాపారాలు సేత్తున్నారండి."

"యేటా యాపారాలు. యేదన్నాపిల్ల యెవ కాలబడ్డా వేంటి."

"అబ్బే నేదండి. అలాంటి గొడవ ఏం సేదు."

"మరి నువ్వు చెయ్యూపుతున్నావు, అదీ చెయ్యూపుతూంది!"

"ఆ ముసలిదాన్నెరుగుదునులెండి."

"అదిగో దానెనకే యెళుతూంది, కొత్త నాజూగ్గా సొగుగ్గా ఉంది. దాన్ని సూత్తే మనసు [illegible] పోతూంది. ముసల్దాని సేమన్నా కదపగలవా!" అన్నాడా వ్యక్తి. చౌకీదారు నిశ్శబ్దంగా ఉన్నాడు. కాస్త దూరాన్నుండి వెంకమ్మజట్టు దొంగ చూపులు చూస్తూ కదలిపోతున్నారు.

"ఏం మాట్లాడవేం" ఆ ముసలిదాన్నెలా యెరుగుదువు.?"

"బియ్యం యాపారం సేత్తోందండి" అన్నాడు అప్రయత్నంగా చౌకీదారు. తరువాత తన తెలివి తక్కువకు నాలిక కొరుక్కున్నాడు.

"ఆ! అదా సంగతి. ఆళ్ళకో మాటసెప్పు తోంటారంటే కదూ! అహా" అంటూ తలూపాడు. చౌకీదారు తలొంచుకునే నిలబడ్డాడు.

"అయితే యీ దారేం దొరకదాయేం" అన్నాడు కొత్త వ్యక్తి.

"వాళ్ళు యిదం వాళ్ళిమిస్తారండీ పాపం. పావలా బేడా లాభాని కమ్ముకుంటారు.

"పోనీ పసుగట్టికళ్ళి ఆ మాత్రమేనా పటాని. దబ్బివాడి పెళ్ళికొచ్చింది కట్నం. అదీ యివ్వలేక పోతే అగుంట చేసా లాక్కురా" అన్నాడు సిగ్గులేని అధికారంవాళ్ళ గక్కుతూ. చాకీదారు మాట్లాడకుండా పనులంకించుకున్నాడు. అయిదునిముషాల్లో వెంకమ్మను కలుసుకున్నాడు.

"ఏం నాయనా! అంత ఒగురుస్తూ పరుగెట్టుకు వచ్చావు. నీకేమన్నా ముట్టచెప్పకుండా ఉంటామా" అంది వెంకమ్మ దలాకీగా.

"అదుగో అక్కడింకోడున్నాడు చూశావా" అంటూ చాకీదగ్గరనుంచున్న ఆ అన్యవ్యక్తిని చూపించాడు. "అతను నా నెత్తి మీద జేవుడు" అన్నాడు.

"అయితే యేటంటాడు."

"పావలో పరకో తెమ్మంటాడు. అలా కాక పోతే, నీ వెనకాలే వస్తోంది చూడూ, అగుంటను వెనకాలే తీసుకు రమ్మంటున్నాడు." అన్నాడు ప్రశ్నార్థకంగా.

గాలులు భయపడిన కోడిపిల్లలా వెంకమ్మ వెనకాల దాగుంది.

"అడిజిమ్మడ! రొదక!" అంది వెంకమ్మ తీవ్ర కంఠంతో ఆకస్మాత్తుగా. అంత దటుక్కున తిట్టేసినందుకు పశ్చాత్తాపపడింది. కళ్ళంట నీళ్ళు తిప్పుతూ.

"నీకు తెలీని సంగతేముంది బాబూ. మేంకూడా నీలాంటోళ్ళమేనా చెప్పు. రెక్కాడితేగాని డొక్కాడదు. యీ కట్టమంతా పడితే ఓపావులా మిగుల్తుందో మిగలదో, దారిపాడుగనా పతీవోడూ ఓ పావలా గుంజుకుంటే మా బతుకు లేంగాను. ఆ గుంజేమన్నా నాపిల్ల గనకా నీ యెంట పంపడానికి. ఆడికేనా సిగ్గులేదంటావా అలా చెప్పడానికి!"

"మొకటు నే నల్లరి పెట్టావనిమ్న. యేదో ఓ పావలా పారేసి మీ నూనాన మీరుపాండి. అది ఆడి మెుగాన పారేత్త." అన్నాడు చాకీదారు సానుభూతి సూచకంగా. వెంకమ్మకూడా రొంటనున్న పావలా తీసి వాడిచేతిలో ఉంచింది. వాడది తీసుకొని—

"యిదిగో ముసలమ్మా! యింకముందు మీరీ బిత్యం మాటలట్టుకుని యీదారినొస్తే జైల్లో పడి పోతారు. లేకపోతే ఆడు చెప్పినట్టు సేత్తొంసవల సింజే. నా సేతుల్లో రేమంలేదు. తర్వాత మీయిట్టం." అన్నాడు తీవ్రంగా.

"అయితే మా బతుకులు పోయినట్టే. యీతొగ గంజికూడా లాక్కుంటా తస్తుందాలి" అంది దీనంగా వెంకమ్మ.

"అయితే ఆడు చెప్పినట్టు సేసుకోండి." అన్నాడు విసురుగా.

"అనా రొనాక సేత్తాంబాబూ. మాకు మాత్రం గౌరవం సేదాయేటి."

"మీయిటం. నే సేం చెయ్యగల్ను. అయినా యిదివరకు లాగే ఆపాలాలదారిని పోండి, ఎవరూ అడ్డేవాడుండడు కాత్తిదూరమయితే నేం" అన్నాడు.

వాడు మాటాడకుండా ఆ పావలా అతని చేతిలో పెట్టాడు. కోపంతో ఆ అధికారి నేలమీద విసిరి కొట్టి "హోరి మెుద్దూ! మన పరువుతీశావురా. పావలా యిస్తే పుచ్చుకున్నావూ?" అన్నాడు.

"అంతే ఇచ్చారండి నిజం చెప్తున్నాను."

"నాకే దుబికి యిస్తామనిచూస్తున్నావూ? ఎవడి దగ్గరోయి యీ పానివేషాలు. వాళ్ళదగ్గర రొక్కం డబ్బులాగేసి, పావలాఅన్నమాట నానోరుజారిందని ఆ పావలా నా మెుఖాన్న కొడుతున్నావా" అని గర్జించాడు.

'లేదండిసార్ ... లేదండి" అన్నాడతడు వణికే చేతులు నలుపుతూ.

"ఏం లేదు? నువ్వు పుచ్చుకున్నావు. ఎంతిచ్చారు నిజం చెప్పు!" అంటూ ఉరిమాడు.

అధికారం దుర్వినియోగం చేసేప్పుడు మానవునిలో మానవత్వం నశిస్తుంది.

"నిజంసార్ —నిజం. నాపిల్లలతోడుగా చెప్తున్నాను పావలా ఇచ్చారు. అంతేనండి" కళ్ళంట నీళ్ళ పర్యంతం తెచ్చుకుని అన్నాడు.

"ఒరేయి అబ్బాయ్, నువదగర అబద్ధంఆడి బతికి రూపయిదూ బయటపడలేదు యిలాంటి ఉక్కులు చేశావంటే వలిసి చేలరాపేస్తా తెలిసిందా. ఇప్పుడేనా నాకొంతయివ్వాలో మర్యాదగా పడెయ్యి. ఇద్దరం సమానంగా పంచుకుందాం. భయపడమాకు" అన్నాడు లాలనగా.

"వాళ్ళు పావలాయే యిచ్చారండి కావాలంటే నా బట్టలు తనిఖీ చేసుకోండి" అన్నాడు భయం ఉట్టి పడుతూ.

"అంతడబ్బివ్వలేదంటే ఆపిల్లనే తీసుకురాలేక పోయినావూ. దమ్మునద్దిమ్మా" అన్నాడు చురచుర చూస్తూ.

"ఆమాటకూడా చెప్పానండి. యీ వేళ కాలస్యం అయినాదంట, మళ్ళీ వచ్చినప్పుడు వస్తానంటూ ఆపిల్లే ఒప్పుకుందండి" అని అబద్ధంతడాడు అసలు సంగతి పసిగట్టి.

"అలా మొండికేయ్యకూడదూ, ఆపావలా ఇలా యియ్యి" అంటూ క్రిందనున్న పావలా వాడి పై పుచ్చుకుని యీల వేసుకుంటూ వెళ్ళిపోయాడు.

## 2

వెంకమ్మవగయిరాలు సేసను చేరుకు నేసరికి సరిగా బండీ స్టేషనులో ప్రవేశించింది. వెంకమ్మ ఆజ్ఞ ప్రకారం అంతా తలో పెట్టెలోనికి వస్తున్నారు. రైలు బయలుదేరగానే యితర రైల్వే ప్రయాణీకులను నానావిధాల ప్రతిమాలి, వినయంమాటలకు, బసాలకు రహస్యస్థానాలు చూసుకున్నారు. వాళ్ళుమాటనెంత రహస్యంగా దాచినా, మెంగాలు చూచేసరికి బోధపడుతుంది ఆసంగతి. అందరి మాదిరీగా కట్టే వీళ్ళూ యీ వ్యాపారం సాగిస్తున్నారు.

అసలే వీళ్ళెవరయినా దిమాయించినా, వారి పోడా, తీని వాళ్ళురాళ్ళు చేతిలోపడేవరకే!

అన్నిటికన్నా ఆశ్చర్యకరమయిన విషయమేమి టంటే, వీళ్ళిలా ధారాళంగా మాటలన్నీ యెక్కిస్తున్నా అందరు చూసీచూడనట్లు ఊరకుంటారు. అధికారు అడిగినా వెంకమ్మ సముదాయించు కుంటుంది. రైలు రెండవస్టేషనులో చేరగానే, వెంకమ్మ అన్ని పెట్టెలు గబగబా తిరిగి అందరినీ ఓసారి చూసుకుంది. మరేం అదుర్దాలేకుండా జాగ్రత్తగానే ఉన్నారు. తనూ తిరిగివెళ్ళి తనమూటలున్న పెట్టెలో కూర్చుంది.

వెంకమ్మ వెళ్ళగానే నాగులు పెట్టెలోకి, ఈ దొంగవ్యాపారం పట్టుకుందుకు వినియోగించబడిన ప్రత్యేక ఉద్యోగస్థుల సిబ్బంది యెక్కారు. రైలు మళ్ళీ తన ప్రయాణం సాగించడం మొదలుపెట్టింది. వాళ్ళు పెట్టెఅంతా కలయవెతకడం మొదలుపెట్టారు. ఆఖరికి నాగులు నావిషయం అన్నీ పట్టుకున్నారు. నాగులు ఓమూల ఒక్క భయంతో బిగిసిపోయింది. మాటాడకుండా కూచుంది తనకు సంబంధం లేనట్టు. అయినా అందరు ప్రయాణీకులు ఊరుకోరుదూ. అందులో కొందరు అనూయాపరులు నాగులుసంగతి చాలా సంతోషంతో ఎరుకపరచారు. ఆమె భయంతో ముద్దయిపోయింది.

ఆ అధికారవర్గంలోని ఒకడు ఆమెవైపు రుసరుస చూస్తూవచ్చి "యీమూటలునీవేనా?" అన్నాడు.

ఆమె నోరుమూసుకు పోయింది. పెదవులు వణికాయి. కళ్ళంట రెండు నీటిబిందువులు రాలాయి. ఆ అధికారికి కోపం ఎక్కువయింది. ముఖం జేవురించింది. కోపంతో ముఖం వికారంగా పెట్టి "యేం, మాటాడవేం వలసేనాపరాయిలాగ? యివి నీవేనా? చెప్పు." అన్నాడు.

"ఆ. నావే" అంది యింక బొంకి లాభంలేదని.

"ఆహా! అలాగా!" అన్నాడు హాస్యధోరణిలో.

ఆమె మాటాడలేదు.

"ఈ ప్రక్కస్టేషనులో దిగి పోలీసుఠాణాకి పద" అన్నాడు తీవ్రంగా.

ఇంతలో ఆఫీసరువచ్చి తన కాయకష్టులా తిట్టాడు.

అతనలా తిట్టవచ్చునని ఏ శాసనంలో ఉందో ఎవరికీ అర్థం అవలేదు. అలా తిట్టినప్పుడు ఆపవచ్చునని కూడా ఏ శాసనంలోను లేదని కాబోలు, ఆ రైలు పెట్టెలో ఎవరూ యేమీ పట్టించుకోలేదు.

నాగులు మాత్రం యేమి మాట్లాడాలో అర్థం గాక అలా శిలాప్రతిమలాగ నిశ్చేష్టంగా నిలబడి పోయింది. ఆ అధికారి అనుయాయులంతా ఆమె చుట్టూ మూగారు. ఆమె అతడి కాళ్ళ వేళ్ళ పడి ప్రతిమాలింది. అతడు చలించలేదు.

విధి నిర్వర్తిస్తున్నాడు పాపం.

అందరూ తలో మాట అంటున్నారు. వాగులు కన్నీటితో వేడుకుంటోంది. అతడు దురుసుగా కసురుతూ, అసహ్యించుకుంటూ తిడుతూనే ఉన్నాడు.

అంతలో ఆ రైలుపెట్టెలో ఓమూలనుండి "ఏమండోయ్, యిలా దయచెయ్యండి" అని వినిపించింది. అందరూ ఒక్కసారి అటు చూశారు. ఆ అధికారీ చూశాడు.

మోటు ఖద్దరుబట్టలు కట్టి, తెల్ల టోపీ పెట్టి, మూలకూర్చున్న ఒక వృద్ధయువకుడు మళ్ళీ ఆ అధికారినుద్దేశించి "తమరినే యిలా దయచేయించండి" అన్నాడు.

ఆ అధికారి అవైపు తేరిపారజూచాడు. ఆ టోపీ చూడగానే అధికారం జ్ఞాపకమొచ్చింది. ఆ దుస్తులు చూడగానే రాజ్యతంత్రం కళ్ళలో తిరిగింది. అధికారి కంగారుపడ్డాడు. తన దురుసుతనానికి తనే నొచ్చుకున్నాడు. మంత్రముగ్ధుడిలాగ అతని పక్కకి వెళ్ళాడు.

"ఇలా రండి. ఇక్కడ కూర్చోండి" అని పక్కన ఖాళీజాగా చూపించాడు. అతనుకూడా మాటలాడకుండా అతని అనుమతిప్రకారం నడచుకున్నాడు.

"చూడండి! పాపం! ఆ పిల్ల ఎంత బతిమాలుతూందో అంత ప్రాధేయపడుతూన్నప్పుడు మీరు కాస్త కనికరం చూపాలేమో."

"అయ్యా! వీళ్ళ సంగతి తమకు తెలీదు. వీళ్ళకు రోజూ యిదే పని. ఎంత కాలమని యిలా ఊరుకోగలం? మా పని మేము చెయ్యాలిగదాండి."

"అలా చూడండి ఆ పిల్ల వేపు! మీరెంత హేయంగా తిట్టినా, మీ మనుషులెంత అవమానించినా, అంత దీనంగా బతిమిలాడుతుంది. ఈలాంటి అపాయకరమయిన పనులన్నీ పొట్టకోసమేగా. కాస్త దయ చూపించండి" అన్నాడా పెద్దమనిషి. ఆ మాటల ధోరణిపట్టి చూస్తే, తను అనుకున్నంత పెద్దమనిషి కాదేమోనని ఆ అధికారికి అనుమానం తట్టింది.

"మీరు లక్ష చెప్పండి, వెయ్యి చెప్పండి! లాభం లేదు. వీళ్ళ కిదో తిండి లేదనుకుంటారు మీరు. మనకన్న వాళ్ళే నయం. పట్టి దొంగవెధవలు. పూరిగుడిసెల్లో ఉంటూ, మాసిపోయిన బట్టలు కట్టి గంజి తాగి డబ్బు గడిస్తారు. ఎంతెంత డబ్బుంటుందో తెలుసా బాబూ వీళ్ళదగ్గర. ఊరికే వీళ్ళని దయతలచకూడదండి" అన్నాడు దరహాసవదనంతో.

"దానికేంలెండి గాని. అంత ఏడుస్తూంటే ఎలా సహించగలుగుతున్నారండి. నా మాట విని యీ రోజుకి వదిలివేయండి" అన్నాడా ముతకబట్టల మనిషి. ఆయన మాట ఎందుకు వినాలో అర్థమవలేదు ఆ అధికారికి.

"ఈ విషయంలో మాత్రం నన్ను క్షమించాలి" అన్నాడా ఉద్యోగి నిష్కర్షగా.

ఇంతలో బండి ఆగింది. అధికారి తాలూకు అనుచరులు ఆ బియ్యం మూటలు క్రిందికి లాగారు. వాగులనుకూడా, వాటితో పాటే ఓ బియ్యంమూట లాగే బరబర క్రిందికి లాగేశారు రెక్కపట్టుకుని. ఓ మూలనుండి వెంకమ్మవచ్చి ఆ జవాన్లతో సంప్రతించింది. వెంకమ్మ తాలూకు ప్రయత్నాలన్నీ విఫలాలయ్యాయి. అంతలో అధికారికూడా క్రిందికి దిగాడు. వాగులు అతని కాళ్ళకు చుట్టుకుపోయింది. అతడు కాళ్ళతో ఆమెను ఓ పాతపీలికల మూట తోసినట్లు తోశాడు. బండికదిలేకాలం వచ్చింది. బండిలోనుండి యీగొడవంతా ఓకంటకనిపెడుతున్న ఖద్దరు పెద్దమనిషి తన సంచీపట్టుకుని క్రిందికి దిగాడు. వాగులు తన్నుద్ధరించడానికి దివి నుండి దిగివచ్చిన పరమేశ్వరుడనుకుంది.

ప్లాటుఫారంనుండి బండి సెలవుతీసుకుంది.

వెంకమ్మకూడా చుట్టుప్రక్కల తచ్చాడుతోంది.

దిగిన పెద్దమనిషి సేరుగా ఆ అధికారి దగ్గరకు వెళ్ళాడు. అతనితో యేదో మాట్లాడుతూ స్టేషను మాష్టరు గదివేపు తీసుకుని వెళ్ళాడు. ఈలోపునే వెంకమ్మ రొంటిన దాచిన రూపాయలూడదీసి ఆజవానుల చేతుల్లో ఉంచింది. వాళ్ళుకూడా ఆడబ్బు పుచ్చుకుని "నువ్వెళ్ళు ముసలమ్మా. యీ స్టేషనులోనే ఉండు. మేం దీన్ని, యీ మూటల్ని కూడా తిరిగి పంపేశాం" అన్నారు కాస్త కంగారుగా. వెంకమ్మ తన దుర్బుద్ధిని నిందించుకుంటూ, వాగులుని ఓదార్చి ఆ చిరుచీకట్లో మాయమయింది. ఆ బియ్యం మూటలన్నింటినీ ఆ అధికారి తాలూకు మనుషులు స్టేషను బయటకు చేర్చారు. వాగులుకూడా వాళ్ళ వెంకాలే వెళ్ళింది.

ఆ అధికారి ఆ పెద్దమనిషి కూడా బయటకు వచ్చేశారు.

అధికారి "ఒరేయ్! ఏం అలా చూస్తున్నారు. పోలీసు వాళ్లను తీసుకు పదండి" అన్నాడు మేఘం ఉరిమినట్లు. అతని నోటినుండి మాత్రం వాన కురిసినట్లు ఉమ్మి తుంపరు రాలాయి.

"అయితే ఆ అమ్మాయిని పోలీసులకు యప్పజెప్ప డానికి తీసుకుపోతున్నారా?"

"ఆ. యిలాంటి చట్టవ్యతిరేకపు పనులెంతకాలం సాగుతాయి చెప్పండి."

"మనం మాత్రం చట్టవ్యతిరేకాలు చేయటం లేదూ? ఏదో కాస్త కనికరించండి పాపం."

"అదేం కుదరదు బాబూ. దీన్ని తీసుకుపోవలసిందే. ఏమయినా సరే."

"యీ వేళకు నా ముఖం చూసన్నా వదలాలి. మీరు మాత్రం చట్టవ్యతిరేకం చెయ్యడం లేదూ. అంతే మరేం అనుకోకండి. మిమ్మల్ని అర్థిస్తున్నాను" అన్నాడు.

"మీ ముఖం చూసి యెందుకు వదలాలో నాకర్థం అవడం లేదు. నేను చేసే చట్టవ్యతిరేకపు పను లేమిటో అసలే తెలియడం లేదు" అన్నాడు విసురుగా అధికారి.

"మీ రామె నలా పదిమందిలో బూతులు తిడుతూ, అవమానిస్తూ, కాళ్లు పట్టుకుంటే కాళ్ళతో తోసెయ్యడం, రెక్క పట్టుకులాగడం, యివన్నీ చట్టాన్ని సమర్థించడానికా? యివేవీ చట్టానికి వ్యతిరేకాలు కావూ." అన్నాడా పెద్దమనిషి కించిత్తు కఠినంగానే.

"నీ కెందుకయ్యా యీ శ్రమంతా, నీదారిని నువ్వు పోవయ్యా చెప్పుడా! లేకపోతే నిన్ను కూడా ఆ పోలీసు స్టేషనులో పారేయవలసి ఉంటుంది ఆ పిల్లతోపాటు. తెలిసిందా వెళ్లు" అన్నాడు.

"అహా! మీ సంగతంతా నే చూస్తున్నాగా. ఆ ముసిలిదాని దగ్గర నీ బంట్రోతులు డబ్బు తీసుకోడం నే గమనించలేదనుకున్నావా?" అనేసరికి ఆ అధికారి ఆశ్చర్యపడ్డాడు. కాని బంట్రోతులను ఏమీ అనలేకపోయాడు.

ఎందుకో అందరికీ తెలుసును!

ఈ మౌనం ఆ ముతకబట్టలాయనకి ధైర్యం యిచ్చింది.

"నేనంత చెప్తున్నా నీకు తెలీడం లేదేం నేనెవర్నో? కలిపాటికి నీ అవస్థ చూసుకుంటూ గాని. బీదవాళ్ళమీద నీ అధికారం, జులుం అన్నీ బాగా ప్రదర్శిస్తున్నావు." అని ఝాడించేసరికి ఆ అధికారి హడలిపోయాడు. ఆ మాటలతో బోధపడినట్టుంది. ఆ ముతకబట్టల్లో ఎంత శక్తి, అధికారం ఉందో! తన తెలివితక్కువ ప్రవర్తనకి తన్ను తాను తిట్టుకున్నాడు.

ఆ అధికారి బంట్రోతులతో ఆ మాటలూ, ఆ డబ్బూ ఆ పిల్లకు తిరిగి యిచ్చేయమని ఉరిమాడు. ఆ మాటలూ డబ్బూ తిరిగి యిచ్చేశారు. వాకలు మాట్లాడకుండా నిలుచుంది. అధికారీ అతని బంట్రోతులూ ఆ ముతక మనిషివానికి నమస్కారాలు పెట్టి ముందుకు పోతున్నారు నిశ్శబ్దంగా.

## 3

ఆ ముసలి వాకలు దగ్గరకు తిరిగివచ్చాడు. ఆమె కెదురుగా నిలబడ్డాడు. వాళ్ళ నెత్తిమీద పిడిలాంటిది వెలుతురు చిమ్ముతోంది.

"ఆ మాటలు, అవి నెత్తి నెట్టుకుపో!" అని కదిమాడు. వాకలు కొంత భయంగాను, కృతజ్ఞతతోను, అతనివైపు చూచింది. అతనియందేదో తెలీని గౌరవం కుదిరింది. ఆమె మాటలు నెత్తికెత్తుకుంది. ఒకడుగు ముందుకేస్తూ "తమరు నన్ను రక్షించారు బాబూ!" అంది మెల్లగా. "మంచి రక్షించడమే. యింతకన్న కూలిపని చేసుకోరాదూ. నానావిధాల చేత చేతులూ కాళ్లూ పట్టించుకు విలాగించుకోడం" అన్నాడు విసుగా తనకూతురికి అలాంటి అవస్థలు పడుతున్నట్టు. ఆమె కృతజ్ఞతతో వింటుంది.

"అయితే తమరు ఎవరు బాబూ" అంది.

"నేనా మీలాంటివాళ్ళు వ్యతిరేకించే చట్టాలు చేసేవాణ్ణి." అన్నాడు.

అతని సౌమ్య భావనాలకు ఆమె తేరుకుంది. తలమీద బరువుతో మెల్లగా అడుగులు వేస్తూ "చట్టాలంటే యేటిబాబూ" అంది మళ్ళి.

"చట్టాలంటే నా, ప్రజలంతా సుఖంగా జీవించడాని కుపయోగపడే కట్టుబాటు. ఒక్కొ విషయంలో ఓ నియమయిన కట్టుబాట్లు. ఆ కట్టుబాట్లు ఎవరూ ఉల్లంఘించ కూడదు. వ్యతిరేకిస్తే నిన్ను తీసుకుపోయినట్లు తీసుకుపోతారు వాళ్ళని కూడా." అన్నాడు తన అధికారానికి ఆనందిస్తూ.

"మరింకంటే బాబయ్యా—బీదోళ్ళని బాధపెట్ట కూడదని, అళ్ళకింది బటా యిల్లు అన్నీ ఉండాలని చట్టం చేయకూడదండి మీరోటు బాబుగారు" అంది యేదో తీరునితలపులు నెమరు వేస్తూ.

"మాకావుగా యీరోజు నిన్ను బాధపెడితే" ఊరుకున్నానా. అలాగే చట్టాలుచేసి తీరతాం"

అంటూ ఆమె బుజంమీద మెల్లిగా చేయి వేశాడు. నాగులు ఉలిక్కిపడి వెనుతిరిగి చూచింది. గుడ్డివెలుతురు. ముసలాయన మోములో చిరునవ్వు వెలుగుతోంది.

ఆమె హఠాత్తుగా తన నడక వేగాన్ని అధికం చేసింది. ముసలివాడి చేయి తెగిన సంకెలలా జారి పోయింది. ఆ వృద్ధుకూడా కాస్త తొందరగా నడిచి ఆమె ప్రక్కకు చేరి "అంత పరిగెడుతున్నావేం" అన్నాడు.

"బండికి టైం అయింది బాబూ" అంది.

"నేనూ వస్తున్నాను" అంటూ మెల్లిగా మళ్ళీ చేయి జారవేశాడు ఆమె వంటిమీద.

నాగులు కా పెద్దమనిషి అవస్థ అంతా అర్థమయింది. మానవత్వాన్ని కత్తితో పొడిచినట్లయింది. అతన్ని చూసి అదివరకున్న గౌరవం పోయింది. కొంప దీసి యికముందు యిలాంటి చేష్టలేమన్నా చేస్తాడేమో అనుకుంది. విషాదముద్ర యైన ఆమె ముఖం లోంచి చిన్న మందహాసం వెలువడింది, దట్టంగా అల్లుకున్న నల్లమబ్బులోంచి తొంగిచూచే మెరుపులాగ. పెద్దమనిషి మృదువైన ఆమె బుజం నెమ్మదిగా నొక్కాడు. ఆమె మళ్లీ జాగ్రదవస్థలో ప్రవేశించింది. మెల్లిగా అతని చేయి తన చేతితో తోసేసింది. వృద్ధునికి టక్కున కోపం వచ్చింది. అయినా అంతకోపం ప్రకటించడం మంచిది కానట్టు తోచింది. "ఈరోజున నేను తోడుపడకపోతే నీవేమయి ఉండేదో తెలుసా." అన్నాడు.

"నిజం బాబుగారు చాలా ఉపకారం చేసినారు. మీ పేరు ఈ జన్మలో మరచిపోను." అంది నాగులు.

"మీలాంటివాళ్ళంతా మాటలతోటే పనులు దక్కబెట్టుకుంటారు." అన్నాడు తొందరగా నడిచి ఆమె పక్కకు చేరి.

"సత్యంగా చెపుతున్నా బాబయ్యా! తమ ఉపకారం నే నెప్పుడూ మర్చిపోను."

"నువ్వు మర్చిపోకపోతే నాకు లాభమేమిటి?" అన్నాడు.

నాగు లేమీ మాట్లాడలేదు. గబగబ అడుగులు వేస్తూ వెడుతోంది. అతను నెమ్మదిగా ఆమె నడుం మీదకు తన చేయి పోనిచ్చాడు ఆమె ఉలిక్కిపడి విసురుగా అతని చెయి విసిరివేసింది. తీసేసిన గొళ్ళెంలా వేలాడింది అతని చేయి. జబ్బ ఎముక కాస్త నొప్పి పెట్టింది. తన ఆత్మగౌరవానికి దెబ్బ తగిలినట్లు బాధపడ్డాడు.

"ఇంత ఉపకారం చేస్తే యిదే నేమిటి? కొంచెమైనా బుద్ధి ఉంటేగా? నీ గురించి యెంత బతిమాలేను ఆ వెధవని." అన్నాడు కోపంగా.

ఆమె మాట్లాడకుండా వేగంగా నడుస్తోంది.

"లేకపోతే యీ పాటికి జైల్లో పారేసి, చావ గొట్టి చెవులుమూసి, నీ వంటిమీద అందరూ తలో చెయ్యి వేస్తే బాగుంటుందేం నీకు?" అన్నాడు.

ఆమె నిశ్శబ్దంగా వేగంగా నడుస్తోంది.

"నీ పక్క వినయాలు, కల్లబొల్లి ఏడుపులు చూచి విడిచాడని అనుకున్నావేం పాపం."

ఆమె నోరు కదపలేదు. వేగంగా నడుస్తోంది.

"దయాగుణం. యిలాంటి వాళ్ళమీద దయ చూడాను. ఇంత సహాయం చేసినా సరే......"

ఆమె మాట్లాడనే లేదు. రెట్టించిన వేగంతో నడుస్తోంది.

"మాట్లాడవేం శిలం కొట్టిన రాయిలాగ!" అంటూ ఆమె చేయి పట్టుకున్నాడు. ఆమె విదిలించుకుంది. అతడు యింకా గట్టిగా పట్టుకున్నాడు. ఆమె యింకా గట్టిగా విదిలించుకుంది. ఆ అదురుకు నెత్తి మీద మూటలు యిద్దరిమధ్యా పడ్డాయి. ఆమె గుండె వేగంగా కొట్టుకుంటూంది. మాట్లాడలేకపోయింది. ఆమె అసహాయత ఆధారంగా తీసుకుని ఆమెను దగ్గరగా లాగుకుంటున్నాడు. ఆమె భయంతో వణుకుతూంది.

వీధి దీపాలుకూడా బెదిరినట్లు కదులుతున్నాయి.

కళ్ళు కోపంతో మెరుస్తున్నాయి. శరీరం బిర బిగుసుకుపోయింది.

"నన్నొదిలెయ్యండి" అని అరిచింది.

"ఇదిగో యీ పదిరూపాయాలు తీసుకో."

"నా దారిని నన్ను పోనియ్యండి" అంటూ తన చేయి లాగుకుంటోంది. అతడు ఆమెను నొక్కి పట్టుకుని తన వేపు లాగుకుంటున్నాడు. ఆమె తనశక్తి అంతా ఉపయోగించి ఒక్కలాగు లాగింది. అతడు ముందుకుపడాడు. ఆమె బరువుగా ఊపిరిపీలుస్తూ నిలుచుంది. అతడు లేవడానికి ప్రయత్నం చేస్తూ కళ్ళంట విస్ఫులింగాలు కురిపిస్తున్నాడు.

"యిదిగో బాబూ! మీ దారిని మీరు పొండి నన్నలరి పెట్టేరంటే గొల్లుపెట్టేసి పదిమందినీ కేక పెట్టేస్తాను." అందామె అతడు లేవకముందే.

"గోలు పెట్టేస్తావేం" నీ లాంటి దొంగలకు సహాయం చేయడం నాదే పొరపాటు" అన్నాడు బట్టలు దులుపుకుంటూ.

ఆమెమూటలు నెత్తి కెక్కించుకుని, మాట్లాడకుండా, అతని వేపు చూడకుండా, గుడ్డిదీపాల వెలుతురులో స్టేషనువైపు వేగంగా నడుస్తోంది. అతడు పడగవిరిగిన తాచుపాములా బుసలుకొడుతూ నడి రోడ్డుమీద నిల్చున్నాడు.

వీధిప్రక్క గుడ్డిదీపాల వెలుగులు దల్లగా నవ్వుకుంటున్నాయి.

# ఆంధ్ర వచనరచన: పూర్వరంగము

శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తి

ఋషుల దర్శనముల ఋక్కులు. రసఋషి వాల్మీకి రాగహృదయము కవితా కారణము. ప్రకృతి సౌందర్యపరవశమును కవితా వకాశము. భక్తియుతమైన భారతావనిలో భగవదారాధనమును గతి కాలమున కవితా భాగధేయమే. ప్రతి సాహిత్య ప్రారంభము, ప్రకృతిలయాత్మకమైన గేయరూపముగ ప్రసిద్ధ సిద్ధాంతము. వైదిక ఋక్కులు, కావ్యానుష్టుప్పులు, గ్రీసు డిథిరాంబ్సు, తెనుగు పదములు అట్టివి. పదకవిత్వమే పరిణామదశలో పద్యకవిత్వముగా పర్యవసించినది. నన్నయభట్టు పద్యకవిత పాండిత్యాశ్రయము. నన్నెచోడుడు పేర్కొనిన ఊయెలపదములు, పాల్కురికి సోమనాథుడు పేర్కొనిన తుమ్మెద పదములు మొదలైనవి పూర్వరంగ పురస్కారములు. పదకవిత్వము తరువాతి పద్యకవిత్వమువలె పద్యకవిత్వము తరువాతి గద్యకవిత్వము క్రమపరిణామము. "గద్యము"నకు "వచనము" పర్యాయవాచకము. "గద్దె" వికృతి.

వచన శబ్దము వాడినది మొదట నన్నయభట్టు. "సమ్యగుమధురరసభావభాసురనానార్థవచనరచనా విశారదులయిన మహాకవులును" అని భారతావతారిక. ఇట వచన శబ్దము క్లీవము. ఇంతకంటె స్పష్టముగా వాడినది తిక్కన సోమయాజి. నిర్వచనోత్తర రామాయణమను పేరే తన్నిదర్శనము. గ్రంథనామమునందే గద్యమునకు వచనమని వ్యపదేశము. తిక్కన వాడిన "నిర్వచన" శబ్దము నిర్దుష్టము కాదు; కాని నిర్దిష్టమే. ఈ ఉత్తర రామాయణములో లేని వచనశబ్ద వాచ్యార్థము, విరాట పర్వాదిగాకల గద్యశబ్ద గర్భితార్థము నొకటే. "మహాకవిత్వ దీక్షావిధి నొంది పద్యములన్ గద్యములన్ రచియించెదం గృతుల్" అని తిక్కన కంఠోక్తియే. అంతే కాదు. "తెనుంగుబాస గద్యమ్ములను బద్యముం జెరసు వంచిత భావరసోదయాభిరామము" మనియె కేతన అభిప్రాయము. గద్యశబ్దమును బహుధా వాడినది పాల్కురికి సోమనాథుడు. మరి, అర్వాచీన లాక్షణికుడు వచన గద్యభేదవర్గీకరణము చేసినమాట వాస్తవమే. అది వైచిత్ర్యమాత్రము. అసలిక పృథక్కరణమును అట్టిది కలదు. ఆంగ్లమునకల "Prose" "Poetic Prose" అనువానికి సమానార్థకములుగా వచన గద్యభేద పరిగణనమది చమత్కార జనకము. యమకములగమకము. అనుప్రాసముల అనుప్రాసములు కల ప్రబంధవచనము గద్యము, తదితరము వచనము అనెడి వాదమది సరి కాదు. కామిక రూఢి లేమి యొక కారణము. అదిగాక అట్టి ప్రబంధ వచనము అతఃపూర్వ కావ్యములందే గద్యము. అంతే కాదు. ఆ పరిగణనము ఆంగ్ల పద్ధతికి అనురూపము కాదు. ప్రబంధేతర గద్యమున కవితాలక్షణము లేకపోలేదు. ప్రబంధ గద్యములందలి శబ్దచిత్రణమే కవితాంశమును కాదు. కనుక తెనుగు సారస్వతమున 'వచనము' అనగా గద్యము అన్నది గతార్థకము కాదు సరికదా సమానార్థకము. సంస్కృతవాఙ్మయమున సైతము వచనగద్య వ్యవహార మొకటే. అసలు "వచ్" "గద్" ధాతువులకే అర్థమొకటి-. "పద్యవచఃశ్రేత్యభిగ్గగసన్నిధానిగదితః-" గద్యమునకు గద్దెవికృతి మాత్రము. పాల్కురికి సోమనాథుని పండితారాధ్యచరిత్రలో దీక్షా ప్రకరణమున "పంచగద్దెలను" అనుపాఠము కలదు. అంతే కాదు. దక్షిణాంధ్రయుగవాఙ్మయమున కోలాటగద్దెలు కొన్ని కలవు. కనుక వచనము గద్యము, గద్దె ఒకటే.

సంస్కృతాంధ్ర లాక్షణికుల వచనభేదవర్గీకరణము లివి:—

"కావ్యం గద్యం పద్యంచ. గద్యం వృత్తిగంధి చూర్ణ ముత్కలికా ప్రాయంచ. పద్యభాగవద్వృత్తగంధి. అనావిద్ధలలితపదం చూర్ణమ్. విపరీత ముత్కలికా ప్రాయమ్."— వామనుడు కావ్యాలంకారసూత్రవృత్తి.

---

(1) ప్రాచీనాంధ్ర గద్య కావ్యములు— చేటూరి ప్రభాకరశాస్త్రిగారు. ఆంధ్రసాహిత్య పరిషత్ పత్రిక సంపుటి 1. పుటలు 88-104; "మీగడ తరకలు"లో పునర్ముద్రితము.

"వృత్తిలేశవిహీనమయిన గద్యము ముక్తకము, వృత్తగంధి, ఉత్కలికా ప్రాయము, చూర్ణకమునని నాలుగు విధములు. తొలిది సమాసరహితము. రెండవది వృత్తభాగములతోఁ గూడుకొన్నట్టిది. మూడవది దీర్ఘసమాసాఢ్యము. నాలవది అల్పసమాసకము."—విశ్వనాథకవిరాజు, సాహిత్యదర్పణము.

"కం. కనుఁగొనఁ బాదరహితమై
పనుపడి హరికథవోలె బహుముఖ రచనం
బున మెఱయు గద్యమదియుఁ
దెనుఁగుకృతుల వచనమనఁగ దీపించుఁ గడున్".

గద్యము: స్వస్తి సమస్త భువన రక్షాదక్ష శ్రీ పుండరీకాక్ష భుజగపతి సింహాసనారూఢ సురనికర మకుట తటఘటిత సుగుచిరమణి గణ ప్రభావిభాసిత పాదపీఠ వేంకటనాథానుకార గౌరవ లలితమూర్తి పుగాలంకృతి చరణ సరసిజయుగళ..........శ్రీ యనంత పద్మనాభ నమస్తే నమస్తేనమః"—అనంతుని ఛందము.

"ఇకనందు గద్యలక్షణం. మఱియునందు గద్యము నైదు భేదంబుల విభాగించు—నయ్యవి యే వంటేను—గద్యము బిరుదగద్యము, చూర్ణికయు వచనంబును, విన్నపంబులునన గద్యభేదంబు లగును ప్రసిద్ధంబున విధమ్ములై వినోదించునందు 1 గద్య క్రమం బెటువలెనంటేని గద్య—అనుకరణ కిబ్బ యుకంబె యొప్పునందు 2 బిరుదుగద్య—సంబోధనాంత పదబంధురంబులై వరలునందు 3 చూర్ణిక—ద్వివచన బహువచన సంబర్భములకు వ్యక్తిగను గాన సమాసాది ఏవమాదిత కల్పనాల్ప జల్పితంబై వెలయునందు 4 వచనములు—బహుప్రకార రచనా విదయ ప్రాచుర్యమ్ములై సంచరించునందు 5 విన్నపంబు లెన్నవిన్నసై యుజామూర్తిమ్ముల నమగమించి విందు నీసంచరిషమ్ములు మితివిరహితమ్ములై స్వేచ్ఛాకల్పనా గౌరవమ్ముల కొలందుల విలసిల్లు"

—సాతుపి వేంకటరమణకవి, లక్షణశిరోమణి.

సంస్కృతాంధ్ర లాక్షణికుల వచనభేద వర్గీకరణములో చూర్ణ, చూర్ణిక, చూర్ణక నామకరణములు సునిశిత పరిశీలనావసరములు. అనావిద్ధలలితపదమైనది చూర్ణము. అదియే చూర్ణకము. అనగా నది సాదా వచనము. మఱి, చూర్ణిక ద్వివచన బహువచన సంబర్భములకు విభక్తినుశాసన సమాసాది సమాసాదిత కల్పనాకల్ప జల్పితము. అనగా నది దీర్ఘసమాసవచనము. కనుక సంస్కృత చూర్ణములు తెనుగు వార్తికలక్షణములనుబట్టియే భిన్నములని స్పష్టము చేయ్య వలసినవులు. అయినను అభిన్నములని ఒకగ్రాహి!—అది మఱి అవిచారితరమణీయము. లక్షణములను బట్టియే కాక, లక్ష్యములను బట్టియు సంస్కృత చూర్ణము, తెనుగు చూర్ణిక భిన్నాకారకతులే. ఎఱ్ఱాప్రగడ హరివంశములో ఒక చూర్ణిక కలదు. అది చూర్ణిక అని 1901 సంవత్సరమందలి ముద్రిత ప్రతిలో అతిస్పష్టము. ఆ చూర్ణిక ద్విత్రిదీర్ఘసంయుక్త పంచాక్షర కతిపయ బంధము. అది గాక మరొక మణిప్రవాళ భాషామయమైన చూర్ణికయు మనకు కలదు. "ప్రాయిక వచనము" అను ప్రత్యేకశీర్షిక నది లక్ష్యమానము. అనంతుని గద్యోదాహరణము, ఎఱ్ఱాప్రగడ హరివంశ చూర్ణిక ఒక కోటివి. ఇక "వచనములు "విన్నపము"లను చూర్ణికా సదృశములే. అన్నిట నొకటే అంత్య ప్రాస్త్యము. భగవత్పరమైన భక్తి నివేదనము గాని ప్రభుపరమైన ప్రపత్తి నివేదనము గాని తిలతండులము. "వచనము"నకు "చూర్ణపదాఖ్య"మని తొల్లిటి అన్నమాచార్యుల సంకీర్తన లక్షణ వ్యవహారము. అది రీతి పరముగా అన్వర్థమే కాని వస్తుపరముగా చూర్ణమే. అటే "వచనము"కంటె "విన్నపము"ను భిన్నమనిపించదు. తాళ్ళపాక పెదతిరుమలాచార్యుల వచనము "విన్నపము చేసిన"దే. అట్టిదే "విన్నపము"ను. అనగా సంస్కృతములోని చూర్ణము, చూర్ణికము, తెనుగులోని చూర్ణపదము రీతిపరముగా నొకటి. తెనుగులోని చూర్ణిక, వచనము, విన్నపము వస్తుపరముగా నొకటి. అంతే కాదు. కొన్ని వచనములందు విన్నపములందు సమాసరచన కలదు. కనుక తెనుగులోని చూర్ణిక, వచనము, విన్నపములందు రీతివిభక్తి దుర్ఘటము. అయోమయము ఒకటే. అనంతుని గద్యమును అందుగతార్థము. బిరుద గద్యమాత్రము భిన్నము. దీనికి కైవారగద్య అని నామాంతరము. కంకంటి పాపరాజు ఉత్తరరామాయణములో నొక కైవారగద్యకలదు అట కైవారగద్య అని లేదు కాని ఆ సందర్భము కైవారమే. తత్పదము నట ప్రయుక్తము. లక్షణశిరోమణి లక్షణమున బిరుదగద్యకు మారు బృహద్గద్య అని ఒకరి ఉదాహరణము ప్రాయికముగా నది ప్రామాదికము. బిరుదగద్యలు రాజలాంఛనములు. విజయనగర సామ్రాజ్యమునకు సంబంధించిన బిరుదగద్యల పుస్తకము వెంకయ్య రామరాజీయము లేక నరపతి విజయము అను గ్రంథమున కలదు. ఇక

సంస్కృత లక్షణములోని వృత్తిగంధి వచనము పద్య భాగప్రాధాన్యము. ఆ పద్యభాగవత్త్వము గణసంఖ్యను కంటె గురులక్షణము గమనార్హము. నన్నెచోడుని కుమారసంభవములో అట్టి వృత్తిగంధి వచనము కలదు. ఆయా ప్రకరణముల ఆయా ప్రభేదములు లక్ష్య మాణములు. ప్రకృతము వచనము రీతిపరముగ అసమాస కము, దీర్ఘసమాసకము అని ద్వివిధమున స్పష్టము. వస్తు పరముగ తెనుగువచనము త్రివిధము. 1. కావ్యగతమైన గద్యములు. 2. విప్రకీర్ణకములైన చూర్ణికాదులు. 3. ప్రత్యేక వచనగ్రంథములు. అందు మరల అవాంతర భేదములు అనేకము. అవి వచనరచనా పరిణామము కలవి ఫలసాధ్యము. ఏతంవిధ వచన పరిచయమునకు సమగ్రాంధ్ర వచన సమీక్షయే కర్తవ్యము.

అసలు పద్యమువలె గద్యము గౌరవప్రదము కాదను దృష్టికలదు. అట్టి భావన అవిచారిత రమణీయమే. "గద్యమ్ కవీనాం నికషం వదంతి" అని ప్రసిద్ధమైన ఆభాణకము. "బాణోచ్ఛిష్టమ్ జగత్సర్వ" మ్మని మించిన కాదంబరియు, "దండినః పదలాలిత్య" మ్మనిపించిన దశకుమార చరిత్రమును వచనకావ్యములే; గద్యగ్రంథములే. పాశ్చాత్యులకును వచనము పరమ ప్రమాణమే.2 ఎలిజబెత్తు కోర్టులోని ఫిలిప్ సిడ్నీ పద్యకవితకు ప్రతిభటత్వము వహించినది వచనరచనములో మహాకవులు కలరనియే. "ఛందస్సులేనిదా ఉత్తమ కవిత ఉండవచ్చును." అనియే కాల్ రిడ్జి అభిప్రాయము: "కావ్యమునకు శ్రుతిలయలవలన కలుగు నిశ్చితత్వము (Certainity) శక్తిమత్త్వము (Force) నియతత్వము (Regularity) అను గుణత్రితయము పద్యబద్ధమైన కావ్యములలో స్పష్టీకృతమై, హృదయస్పందకములైనట్లు వచనములో కుదరదు." అని మేథ్యూ ఆర్నాల్డు వక్కాణించినప్పటికిని "వచనములోను శ్రుతిలయలు కలవు" అనియే సిడ్నీ వాదము. గద్యముకంటె పద్యము గంభీరమన్నది షిల్లర్. అతడు మొదట తానొక కావ్యము గద్యములో వ్రాసి తరువాత పద్యములో వ్రాయగా భావనాభేదమున గద్యరచనము నీరసమనిపించుటేగాక పద్యరచనలో ఆత్మికసనము కలదని తెలిపిన తదుభయకవి. కాని ఆంగ్లేకవులు మాత్రము శ్రుతిలయాత్మకమైన వచనములో రసప్రసరమైన రచనముచేసి "పండితాః సమదర్శినః" అను ప్రవచనమును అన్వర్థము చేసికొన్న అవర్ణ్యకవులు. "పద్యగద్యమయం చంపూరిత్యభిధీయతే"—పద్యగద్యాత్మకమైన చంపూరచనము ప్రత్యేకాంధ్రసంప్రదాయము. కారణము సంస్కృత చంపూకర్తలయిన అనంతకవి (భారత చంపువు) లక్ష్మణకవి (చంపూరామాయణము) ఆంధ్రులగుటయే. కాదంబరీ దశకుమార చరిత్రలతో పాటు తచ్చంపూగత మసృణమధుభణితి ఆంధ్ర సరస్వతికి అధ్యాపకవాణి. సంస్కృత వ్యాసపముల్లసితమై సహస్రవసంతవికసితమైన, విలసితమైన తెనుగు సారస్వత నందనవనములో పద్యలతికలు గద్యగతికములు.

తెనుగు ద్రావిడజన్యమే అయినప్పటికిని పోషించి పెంచినవి ప్రాకృతసంస్కృతములు. ముఖ్యముగ సాహిత్యముఖమున ఆంధ్రుల ప్రథమసాహితి గాథా సప్తశతి ప్రాకృతమే. ప్రాకృతము శాతవాహనుల కాలమున రాజభాష. ఆలనాటి హాలుని అర్ధాంగి లీలావతికి సంస్కృతమే లీలావిలాసము. ఆ రాణీవారికి జలక్రీడలోను గీర్వాణమే! పాపము, హాలునికి సంస్కృతము పాఠమైనది. పల్లవులనాడు సంస్కృతము పాలకవ్యవహారభాషయే. మూడవశతాబ్ది శాసనములందుకు మూదల. అట్టి ప్రాకృత సంస్కృతముల ప్రాభవమున ఆంధ్రులదేశభాషకు అమనిపాంతు. అసలు దేశభాష అనుదిన వాగ్వ్యవహారము. ప్రతిభాషకు నది ప్రాథమికదశ. వాగ్వ్యవహారము వచనైక రూపము. ఆ వచనము ఆలంకారిక రచనమైనపుడే ప్రత్యేక వాఙ్మయప్రాదుర్భావము. వ్యవహారదశయు వర్తమానము. వాఙ్మయవచనమునకు వ్యవహారవచనమే ప్రాతిపదిక. ప్రాచీన వ్యవహారవచనమునకు ప్రభువుల శాసనములు కొంతవరకు ఉపాధులు. ప్రజల దైనందిన వ్యవహార వచనమునకు ప్రత్యేకవసతి లేదు. ప్రభుశాసనములందే ప్రజావాణి ప్రకృతిప్రతిఫలనము సాధకము. అది వచన రచనాప్రాథమికదశ. ఉపలబ్ధశాసనములలో ఉన్నది మొదట గద్యము. తరువాత పద్యము. కాని పద్య కవిత్వము తరువాత గద్యకవిత్వము క్రమపరిణామము. నిజమే, శాసనవచనము కవిత్వవచనము కానేకాదు. కేవల పాలక వ్యవహారములోనిది వచనము. శాసనములు వార్తాప్రధానములు. పత్రికలవంటి శాసనములలో ప్రత్యేక సంచికలకవితా నీరాజనములవలె పద్యముల పల్లవి సంభవము. కనుక శాసనములలో ప్రథమతః

(2) అముద్రిత సాహిత్య విమర్శనము—పింగళి లక్ష్మీకాంతము గారు.

కనిపించునది వచనము. అది మరల త్రివిధము. మొదట పదము. పిదప వాక్యము, తరువాత సమాసరచనము. ప్రాకృతసంస్కృత శాసనపాళికలందు తెనుగుపదములు కలవు "వేఁపూరు. విషేపలు" మొదలైనవి. ప్రథమతః లేఖనయోగముపట్టిన తెనుగు వాక్యములు ఆరవ శతాబ్ది క్రింది శాసనపంక్తులు.3

"స్వస్తిశ్రీ పోలిమహారాజా లోకన ఇప్పుటిలి అవిపోతులు రేవణకాలు పుద్గణకాలు ఇచ్చిన పన్నస పెన్బొతు ఇకోటేనికిన్ లేనిచెచ్చినవాన్డు పఞ్చమహాపాతకున్డగున్"

"మఙయకమ్మఙగఙ యకమ్మఙ వృద్ధికమ్మఙ ఇవముమ్వుర ఒకాడు బోయిలేని కిణగోడిన ఇల్లకా వెలుకువారు పనితిభోగము పానభోగము పట్టముకువ రట్టోల్లు పుణ్యపాలుగన్డి భోగము ఇన్దలు దీనికి సక్షి."

తొమ్మిదవశతాబ్ది4 గుణకవిజయాదిత్యుని ధర్మవర శాసనమున గద్యవద్ధికి గజ్జె కదలించినది. "అనేక గుణగణాలంకృత సమస్త మహామండల ప్రకాశితకీర్తి" మొదలైన సమాసములు మొదలైనవి. అనగా ప్రాకృతప్రాధిక్యముపోయి సంస్కృత సార్వభౌమత్వమునకు స్వాగతము. పండరంగని అద్దంకి శాసనమున పద్యగద్య రచన పట్టువడినది. రెండవ ధర్మవర శాసనమున గట్టిపడినది. దీర్ఘ సమాస రచనము దీర్ఘ కృతా ప్రాంగమే. "విజయాదిత్య పాదపద్మభ్రమరాయమాణ సమస్త రాజ్యధుర నిరూపిత మహామంత్రాధిపతి."— సన్నుతభట్టు నాటి శాసనములందు సం. లే. 5 "సముదారాతి మత్తమాతంగ ఘటాసహస్ర విదారణదారుణ ఖరనఖరపంజర! సామన్త వజ్రపంజర నిజభుజ పరాక్రమ నిర్జిత ప్రతిమల్ల పరబల జలనిధి కబళన బడబానలోద్రగ్రదావానల!..."

పద్యశాసనములందును గద్యపంక్తులు కలవు. పండరంగని అద్దంకి శాసనమున (క్రీ. శ. 6౮8) "పండరంగు పరచు మహేశ్వరుణు ఆదిత్య భటారనికి ఇచ్చిన భూమి రెండుబది పుట్ల అర్ల పట్టు శెలదమ్మపురంబున దమ్మకొలు వీని రక్షిష్చువారికి అశ్వమేధంబున ఫలంబు అగు" నని కలదు. యుద్ధమల్లుని బెజవాడ శాసనములో (క్రీ. శ. 898) "దివిం శ్రీక్రోలు యేలెడు (వా) రతిరంబే (వా) రొణ్ఱుసాటి గొంగ (లు) ను బెట్టువేఁగను (జ) ను యా స్థితి సేకొణికొను (వా) ర దీనిస్ద్దారు నిల్పిన వారు (స్త్రీ)శి డప్పి యడిపుట పా (పం) బు గాన" అని వచన భాగము. ఒక అమరావతి శాసనమున (క్రీ. శ. 1108) "స్వస్తి సమస్త ప్రశస్తి సహితం శ్రీమన్మహామణ్డలేశ్వర కులోత్తుంగచోడ గొంకరాజుల దివ్యశ్రీపాదపద్మోపజీవియైన కొణ్డప్రోలె నాయకుని పెద్దమ విణ్ణమగొడ్డప్రాని శ్రీ మదమరేశ్వర మహాదేవర కాచంద్రార్కతారమఖండ వర్తి దీపంబున కిచ్చిన గొఱియలు ౫౦" అని గద్యము.

అర్వాచీనములైన అనేక శాసనములు కేవల వచన రచనములు. అవిగాక కేవల పద్య రచనములయిన అనేక శాసనములందును, అంతకంటె కేవల సంస్కృత భాషా రచనములయిన బహుశాసనములందును, గ్రామసీమలు తెలుపు భాగము తెలుగువచనమే. ఆ వచనము ఆనాటి వ్యావహారిక భాష. అంతేకాదు. అలతివాక్యములు అరుదుగనైనలేని సుదీర్ఘమైన ఏకైక మహావాక్యముగ నుండుట వైలక్షణ్యము. 1480 సంవత్సరమందలి అల్లయ దొడ్డారెడ్డి కొండుదుగు శాసనమిందుకు నిదర్శనము. అలతి వాక్యములు అరుదుగ గల మహావాక్య రచనము కలదు. 1434 సంవత్సరమందలి అల్లాడ వేమారెడ్డి వేమవర శాసనమిందుకు నిదర్శనము. ఈ రెండు శాసనములు కూడ కేవల సంస్కృత భాషాగ్రథితములే. గ్రామసీమలు తెలుపు సందర్భమొక్కటే తెలుగు వచనము. బహుశాసనముల కిది పాటలమైన పద్ధతి. ఆ పద్ధతికి అట్టి సర్వశాసనములందును సంప్రదాయమైన పీఠికా ప్రాయ శ్లోకమిది.

"అస్య గ్రామస్య సీమానో దిక్షు సర్వాసు చ క్రమాత్
సర్వేషాం సుప్రబోధాయ లిఖ్యంతే దేశభాషయా"

ఆ దేశభాష ఆంధ్రావనిలో ఆంధ్రమే కదా! ఏత దుదాహరణములు స్థలవిస్తర హేతువులని ఉపేక్షితములు. ప్రధానముగ నిట పండరంగని రెండవ ధర్మవర శాసనమందలి సమాసవచనము గమనార్హము.

3. నన్నయకు పూర్వము ఆంధ్రభాష — మల్లంపల్లి సోమశేఖరశర్మగారు. ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక. వృష. పుటలు ౮-16.

4. ఆముద్రిత సాహిత్య చరిత్ర — డాక్టర్ సి. వి. ఆర్. నరసింహంగారు.

5. భాషావికాసము—గంటిజోగి సోమయాజిగారు. పుట 149.

అది తొమ్మిదవ శతాబ్ది ఆంధ్ర వచన రచనా పాటవము.

తెనుగు వచనము తొలి వేకువలో నే సమాసకుసుమావళి నివాళి. ఆ కుణాలింపు కన్నడ కస్తూరిగా అభాసము. ఆనాటి రాజులు కన్నడ రాజ్యలక్ష్మికి ఆత్మబంధువులే కాని, సంస్కృతము అప్పటికి ప్రభువుల అందల మెక్కినది. అంతేకాదు. జీవితమున ఆరాధ్యదేవత. పండితులకు ప్రాణము. ఎనిమిది తొమ్మిది శతాబ్దుల చంపూకర్తలేగాక పదికొండవ శతాబ్ది "అపార శాస్త్ర పారగులైన నైయాకరణులు, భారత రామాయణాద్యనేక పురాణ ప్రవీణులైన పౌరాణికులు, మృదుమధుర రసభావ భాసురనవార్థ వచన రచనా విశారదులైన మహాకవులు. వివిధ తర్కవిగాహన తను సర్వశాస్త్ర పారగరీణ ప్రతిభులైన తార్కికులు" మొదలైన విద్వజ్జనులు రాజరాజు కొలువులో అనూంతియు ఆకాశమునుండి యూడిపడిన అలఘు ప్రతిభులు కారు. ఆంధ్రావని గల సంస్కృత పండితులే. ఆనాటికే సంస్కృత గ్రంథములు సమాస బంధురములు. "అశ్రాంత శ్రుతిపాఠపూతరసనావిర్భూత భూరి స్తవా జిహ్మ బ్రహ్మముఖౌఘ విఘ్నిత నవస్వర్గ క్రియా కేళిః" అని ఆరవ శతాబ్ది నైషధశ్లోక సమాస రచనము. ఏడవ శతాబ్ది వచన కాదంబరీ సమాసకల్పనము, దండి వచనము ఆంధ్రవచనమునకే ఆద్యప్రకృతులు. ఎనిమిది తొమ్మిది శతాబ్దుల నాటికి సంస్కృత వచన సంభావనలే సమాస భూయిష్ఠములు. "తాలద్రుమాంద్రా తిప వక్షఃక్షత గ్రహాగ్రాం దహంస సపద్భుజకుసుమద కోకనద కోరక కుసుమపరాగ ధవళిత దిఙ్మండలం" అని వేణీ సంహారము. అంతేకాదు. అటు నన్నయభట్టుకు, ఇటు శ్రీనాథభట్టు సుకవికి మాత్రమే గాక అనేకాంధ్ర కవులకు ఆదర్శమణి దర్పణమయిన మురారి అనర్ఘ రాఘవము దీర్ఘసమాస దివ్యదీపికా నికేతనము. "ఇదమిదం చన పీయూష తుషార శిశిరాపార వర్తిని సుజన సంవాద కౌతుక మేఘరేఖా పారశ్రీ సేవనమనుతాలోకవాఞ్ఛేవ సహస్ర శిఖరీ క్రమతే." "అహో గోదావరీ తీర తింగశీకర సీకసుకుమార మాంసల పరిసరారణ్యమాలినో జనస్థాన సీమానః"—అని మురారి నాటక ముగ్ధ మోహన సమాసవచన సంభావనలు. అట్టి సంస్కృతి సైంధవ్యమున ఆంధ్ర సరస్వతి అవతరణము. అనగా తెనుగు సమాసము సంస్కృత సమాసమునకే అనుపల్లవి.

సమాస రచనము శాసన వచనములో పరిణతావస. ప్రభుసంబంధి వచనముతోపాటు సర్వ ప్రభువైన దైవ సంబంధి వచన మొకటి రావాసు సంభావ్యము. భక్తిరస భరితమయిన ప్రత్యేక రచన మట్టిది ప్రథమ వాఙ్మయ వచనము. అట్టి రచనము ఆనాటి భ అను భావమే కాదు. ఆధారములును కలవు. పన్నెండవ శతాబ్ది ప్రథమ భాగమునందలి వాడగు మల్లికార్జున పండితారాధ్యుడు బహుగద్యకర్త. శివగద్య, అక్షర గద్య, పంచగద్యలు వ్రాసినట్లు పండితారాధ్య చరిత్రలో పాల్కురికి సోమనాథుని ప్రత్యక్ష సాక్ష్యము. అవిగాక మల్లికార్జున పండితారాధ్యుని "లింగోద్భవ గద్య" "శ్రీముఖ గద్య" ప్రసిద్ధములు. శ్రీముఖ గద్య తెనుగు వచనము అని కొందరి అభిప్రాయము. అనుపలబ్ధమగు శ్రీముఖగద్య ఆంధ్రవచనము అగునో కాదో అనుమానము. ఇక లింగోద్భవ గద్య—ఇది కూడ అనుపలబ్ధము. ఎఱ్ఱాప్రగడ నృసింహ పురాణములో స్తంభోద్భవ గద్య మొకటి కలదు. లింగోద్భవ, స్తంభోద్భవ నామసాదృశ్యము గమనార్హము. అంతేకాదు. స్తంభోద్భవ గద్యలో "భక్తజన వచనరచన వర్తన చింతితానుగ్రహ విరచిత గాఢ కరుణా సుధాపూరిత పుణ్యహృదయ ప్రవేశింబుము" అను వాక్యముకలదు. 'భక్తజన వచన రచన వర్తనము' కూడ గమనార్హము. అట్టి వచనము—దూర్ఛక—ఎఱ్ఱాప్రగడ హరివంశమునందు కలదని పూర్వోక్తము. అర్వాచీనముగ అట్టి వచనములు శ్రీనాథుని కృతులలో అధికము. అవిగాక "కాలోచితంబుగాఁ గైవార మొనరించెఁ బలుకఁ దొడ్డ్యలి గద్యపద్య సరణి" అని కాశీఖండమునందు, "హృద్యంబులగు గద్య పద్యంబులు తుంబుర నారదాదులు పఠింప" అని భీమఖండమునందు కలవాక్యములు కైవారగద్యమునకు, భక్తి వచనమునకు సూచకములు. ఇక పాల్కురికి సోమనాథుని గ్రంథములందు ఇట్టి సూచనలు కోకొలలు. బసవ పురాణమున మాలాయుని కథలో "ప్రస్తుతోక్తుల గద్యపద్య కావ్యముల విస్తారముగఁ జేసి వినుతించువారు" అనియు, ఒడయనమ్మి వాల్మీకి గుడికి వచ్చు సందర్భమున "గద్యపద్యాద్యనవద్య కావ్యముల హృద్యంబుగా సంస్కృతవిశ్వగల్ వోగడ" అనియు, పండితారాధ్య చరిత్రలో వాదప్రకరణమున "గద్య పద్యంబు లాకాంక్ష చదువుచును" అనియు పర్వత ప్రకరణమున "పద్యముల్ వద్యముల్ గద్యముల్

కాంగ" అనియు స్పష్టముగ కలవు. అట్టి గద్యలు అనగా ప్రత్యేకమైన భక్తి వచనములు అర్వాచీన రచనములు పెక్కు ఉపలబ్ధములే. అందు "ఏకాంతి వచనములు" "వెంకటేశ్వర వచనములు" వైష్ణవపరములు. "కాశికా వచనములు" "భవానీమనోహర వచనములు (పురాతన శంకరవచనములు) శైవపరములు. అవి ప్రథమరచనలు, తత్కర్తలే ఆద్యాచార్యులు కారు. అతఃపూర్వమే అట్టి వచనములు కలవని పై సూచనల పర్యవసానము. పాల్కురికి సోమనాథుని బసవ పురాణమందలి హలాయుధ కథలో "వివిధాలు వగిత ప్రస్తుతోక్తుల గద్యపద్యకావ్యముల విస్తారముగఁ జేసి వినుతించు మేటిరౌ ఘనుధీ కవీంద్రులు" సంస్కృత పండితులు, సత్కవీశ్వరులు కాని సామాన్యాంధ్ర జనులు. వారుగా వినుతించునవి సంస్కృతము వల్లె వేతలు గాక ఆంధ్రము అల్లికలే. అంతే కాదు. ఆనాటికే భక్తివచనములు ప్రచురప్రచారము, శైలీ పరిణామము చెందినవి, ఎఱ్ఱాప్రగడ హరివంశమున మార్తికప్రవేశము, తుదదవా ప్రౌఢిమ తెలుపఁజెదు. అట్టే సామసాదృశ్యమున ఎఱ్ఱాప్రగడ శంభోద్భవ గద్యకు మల్లికార్జున పండితారాధ్యుని లింగోద్భవ గద్య ఆద్య ప్రకృతి అగు నేమో! ఆద్య ప్రకృతిని మించ వలెనను అనుసంధానాధిక్య రచనా ప్రవృత్తియు సర్వకవి సాధారణము. ఎఱ్ఱాప్రగడ శంభోద్భవగద్యకు బమ్మెర పోతనామాత్యుని నరసింహావతార వచనము ప్రతి స్పంది రచనమే. కనుక లింగోద్భవ గద్య ఆంధ్ర వచనములకు అబ్బురము కాదు.

అంతే కాదు. పాల్కురికి సోమనాథుని "ఉరుతర గద్య పద్యోక్తులం బె" "అరూఢ గద్య పద్యాది ప్రబంధ పూరిత సంస్కృత భూయిష్ఠరచన" అను వాక్యములు అత్యంత ప్రసిద్ధములే కదా! అవి నన్నయకు అక్షేపములనుట పరిపాటి. కాని "అరూఢ గద్య పద్యాది ప్రబంధ" అను వాక్యమున ఆదిశబ్దమునకు అర్థము?—"గద్యపద్యద్వయనవ్యకావ్యములు" అను చోటను ఆదిశబ్దమే. ఆ ఆదిశబ్దమునకు అర్థము? అసలు ప్రబంధ శబ్దమునకు అర్థము?—తిక్కన భారతమును "ప్రబంధమండలి" అనుటచే ప్రబంధమొక ప్రక్రియా భేదముగాను తిక్కన తదితరానుహాముడుగను బహు సంఖ్యాకుల బాహాట పరవశము! నన్నయభట్టు ప్రబంధ శబ్దమును భారతపరముగా వాడలేదా?

"సత్యవాక్ప్రబంధ శతసహస్ర శ్లోక
సంఖ్యమయినదాని సర్వలోక
పూజ్యమయినదాని బుధనుతవ్యాస మ
హాముని ప్రణీతం బయినదాని"

అని ఆంధ్ర మహాభారతము ఆదిపర్వము కృతి యాశ్వాసములో తొమ్మిదవపద్యము సీసముయొక్క ఎత్తుగీతి. ప్రబంధమనగా గ్రంథము. కావ్యము. అను నిక ప్రక్రియాభేద పరిగణనమటుంచి ఆనాడు ప్రబంధ మనగా గ్రంథమాత్ర మనుటకు శాస్త్రప్రమాణము, శాసన ప్రమాణమును కలవు. "ప్రబంధ వచన" మను శీర్షిక వని వక్ష్యమాణములు. ప్రకృతము "ఆది ప్రబంధము" నకు అర్థము ప్రశ్నీయము. "గద్య పద్యాది ప్రబంధ" మనగా గద్య పద్యాత్మక గ్రంథమనుట అసంగతము. అదిపదమునకు ఆశాస్త్రీయము కేవల కల్పనా చమత్కారమే. "గద్యపద్యాది ప్రబంధపూరిత" అనగా గద్యము పద్యము మొదలైన గ్రంథములందు నిండిన— అనిమాత్రమే అర్థము. అనగా గద్యగ్రంథములు, పద్య గ్రంథములు, ఇతర గ్రంథములు అనిస్పష్టము. భక్తి వచనమొక ఇతర గ్రంథము. దండకమువలె. అంతే కాదు. ఇంకను బసవపురాణమున "సాంగభాషాంగ క్రియాంగ పటునాటకంబుల నటియించువారు"— "వివిధ నాటక మహోత్సవము లొప్పార" అనియు, పండితారాధ్య చరిత్రలో "మానిదండకము, స్తుతిమాలమును మహాస్తోత్ర మాత్రంబుల శతకంబు, శతకత్రి హారంబు, దీపకళిక, మహానాటకము, సుదాహరణములు...ముక్తకాదులు... గీతంబులు"—"ప్రమథ పురాతన పటుచరిత్రములు క్రమమొంద బహునాటకము లాడువారు"—"లలితాంగ రసకళాలంకారరేఖ లలర బహురూప మాడెడువారు" అనియు పాల్కురికి సోమనాథుని అందింపులే కనుక దేశినాటకము, మహానాటకము, బహురూపము, శతకము, దీపకళిక, ఉదాహరణము, ముక్తకము, గీతము-మొదలైనవి ఆనాటి ఇతర గ్రంథములే. సంస్కృతమునకు సామంతమైన తెనుగు భాషలో ఆది ప్రబంధములవి సంస్కృత భూయిష్ఠములగుట సర్వకాల సంభవము. అందలి భక్తి వచనములును అట్లగుటకు సంస్కృత గద్యలును సహకారము. పాల్కురికి సోమనాథుని నమస్కార గద్య, పంచప్రకార గద్య, అక్షరాంక గద్య సంస్కృతములే. పాల్కురికి సోమనాథునికి బహుపూర్వము గద్యలు బహుభాషల కలవు. కనుక సమకాలిక సంస్కృత ప్రౌఢ గద్య ప్రభావమున మల్లికార్జున పండితారాధ్యుని లింగోద్భవగద్య అట్టి సంస్కృత భూయిష్ఠరచన

సరిత్సాగరం బహుళ ప్రచారం పొంది బాగా ప్రసిద్ధి కెక్కింది.

దీనికి మహామహోపాధ్యాయ వేదం వెంకట రాయశాస్త్రి 1880 లోనే తెనుగులో ఒక గ్రాంథి కానువాదం రచించారు. అదివారి పదరచన కొక నిక షోపలమై తెనుగునాట ప్రసిద్ధి పొందింది. ప్రస్తుత గ్రంథం వారి పౌత్రులయిన వేదం వెంకటరాయశాస్త్రిగారు రచించారు.

దక్షిణభాషా పుస్తక ప్రచురణసంస్థ వారి సాహాయ్యంతో వీరే ఇది ప్రచురించారు.

తమ తాతగారి గ్రంథంలోని గాథలే స్వీకరించి ఆయా ఘట్టాలలో ఉన్న వర్ణనలు మొదలైనవి తగ్గించి తామీ సంగ్రహ కథాసరిత్సాగరం సంతరించామని రచయిత తెలియజేస్తున్నారు. మూలసంస్కృతగ్రంథంలో ఒక మహా గాథలోనే అనేక కథ లిమిడిఉంటాయి. అందుచేత ఇటువంటి చిన్న పుస్తకంలో ఇది కేవలం స్వతంత్ర కథలుగా రూపొందించడం తప్పనిసరి. ఇందుచేత వీటి సహజస్వరూపాని కేదైనా లోపం కలుగకపో వచ్చును. కాని పాఠకుల కవి స్వతంత్ర కథలవలె స్ఫురిస్తాయి.

దక్షిణభాషా పుస్తక ప్రచురణ సంస్థవారు తమ గ్రంథాలు అక్షరాస్యులైన సామాన్యప్రజల కందేటు వలెనని సంకల్పించారు. అయితే రచయిత కథాకథ నానికి మూలగ్రంథంలోని గ్రాంథిక భాషే ఎన్నుకొన్నారు. చదువుకోవడానికిది సరళంగానే సాగి పోతున్నది.

కాని వ్యావహారికంలో ఈ రచనసాగి ఉంటే స్వతంత్ర కథాగుచ్ఛంగా రూపొందిన ఈ చిన్న పుస్తకం పాఠకు లందరికీ ఇంకా అందుబాటులోకి వచ్చిఉండేది.

ముఖచిత్రము పుస్తక స్వరూపము చక్కగా ఉన్నాయి. దీని ప్రకటనకు తోడ్పడిన దక్షిణభాషా పుస్తకప్రచురణ సంస్థ అధికారులభినందనీయులు. మన ప్రాచీన భారతీయ కథా సాహిత్య ప్రచురణకు ఇతోధికంగా తోడ్పడగలరని ఆశిస్తున్నాను.

'శాస్త్రి.'



## గ్రంథ స్వీకారం

### బొమ్మలుచెప్పిన భూగోళం

రచన: శ్రీశైలం. భవానీ పబ్లిషింగ్ హౌస్, విజయవాడ. వెల: 75 నయాపైసలు.

### జనవాక్యం

వలభనేని కాశీవిశ్వనాథం. ప్రతులకు: రచయిత మెయిన్‌రోడ్. పవరుపేట, ఏలూరు, పశ్చిమగోదావరి జిల్లా. అమూల్యము.

### చిక్కుల గుర్రమునకు కక్కుల కళ్ళెము.

శ్రీ పి. యస్. ఆచార్య. ప్రకాశకులు: సర్వోహిత సంఘము. కుందేరు. కృష్ణాజిల్లా. వెల: 25 నయాపైసలు.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad